# అనగా అనగా...

(కథలు)







సంకలనకర్త :

మండా సూర్యనారాయణ (మసూనా)

సమీక్షకులు :

సంకలనాల శ్రేణి : 5
ప్రథమ ముద్రణ : (C) 1979



ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ
ప్రచురణ :
నవంబరు 14, 1979



**వెల : రు. 3-00**

ముద్రణ :
రమేష్ ప్రింటర్స్ అండ్ పబ్లిషర్సు
చిక్కడపల్లి
హైదరాబాదు : 500 020

ప్రకాశకులు :
ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ
34/ 4 R T, బర్కత్‌పురా క్వార్టర్సు
హైదరాబాదు : 500 027.

# వినతి

బాలలు మన హృదయాలు పూచిన పసిడి మొగ్గలు. ఆ మొగ్గలు నిగ్గుదేరి, వివిధ వర్ణాలతో విప్పారిన, పరిమళ శోభితమైన ఆమని వికసిస్తుంది. ఆ ఆమని అమృతమయం కావడానికి పాటుపడే కృషీవలులం మనం. ఆ కృషి ఎంత పవిత్రమైనది! ఎంత ఆనంద రమైనది! అదే బాలానందం!...... అదే బ్రహ్మానందం!......"

పూజ్య బాపూజీ వంటి పవిత్ర భావుకుల భావన లివి. ఆ భావనలే మన బాలల అభ్యుదయ కార్యక్రమాలకు కరదీపికలు అవుతున్నవి.

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ అవతరించినదాదిగా, ఈ ఆశయ సాధనకే అహ రహమూ కృషి చేస్తున్నది. విద్యా, సాంస్కృతిక, కళా, వైజ్ఞానిక రంగాలలో బాలల వికాసానికి తోడ్పడుతూ వారిలో అజ్ఞాతంగా వుండే కళాభినివేశాలకు ప్రేరణ కల్పించే కార్యలను చేపట్టి, బాలల సర్వతోముఖాభివృద్ధికి కృషిచేయడమే ధ్యేయంగా బాలల అకాడమీ పని చేస్తున్నది.

అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా, బాలల అకాడమీ చేకొన్న వివిధ కార్యక్రమాలలో "బాల వాఙ్మయ సంకలనాల" ప్రచురణ ఒకటి.

బాల వాఙ్మయంలో ప్రముఖులగువారు సంతరించిన ఈ సంకలనాలు—నాటికలు, నృత్య నాటికలు, కథలు, గేయాలు, పొడుపుకథలు, జీవిత చరిత్రలు- వివిధ శాఖలకు చెందిన సంకలనాలు సంపుటాలుగా ప్రచురితములైనవి. ఇది ఎంతో సంతోషింపదగిన విషయం.

"చిన్నారి బాలలకు చిన్ని పుస్తకాలు" అనే ఆశయంతో వెలువడుతూవున్న ఈ పుస్తకాలు బాలల నలరించగలవని ఆశిస్తూ—ఈ కార్యక్రమం ఫలప్రదం కావడానికి సహకరించిన వారందరికీ నా అభివాదాలను తెలుపుతూ వున్నాను.

ఇట్లు,

**టి. హయగ్రీవాచారి,**

అధ్యక్షులు,

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి,

హైదరాబాదు.

14 నవంబరు, 1979.

# ముందు మాటలు

నలభై ఏళ్ల క్రిందటికీ, నేటికీ బాలసాహిత్యం ఎంతో పెరిగింది; మెరుగైంది. ఎన్నో పత్రికలు వెలిశాయి. పుస్తకాలు ప్రచురింపబడ్డాయి— ఇది శుభ సూచకం.

పిల్లల కథల సేకరణ సాధారణ విషయంకాదు. ఎన్నో పుస్తకాలు, పాత పత్రికలూ చూడాలి. గ్రంథాలయాలు శోధించాలి. ఎంతో ఓపిక, తీరిక ఉండాలి. ప్రయాసపడ్డాను. అయినా సంతృప్తి కాలేదు. ఎంతో మిగిలి వుండిపోయింది. వంద కథలు సేకరించాలనుకున్నాను. యాభై అయిదు కథలు మట్టుకే సేకరించకల్గేను. ఇక్కడ, అక్కడ ఎన్నో మంచి కథలు వుండిపోయాయి. గొప్ప రచయితల ఎంతో గొప్పవైన కథలూ ఎన్నో వుండవచ్చు. నాకు అందుబాటైన వానిలో కొన్ని కథలన మాత్రమే సంకలనం చేయగలిగాను.

అజ్ఞాత రచయితల కమ్మనైన పాతకథలు ఎన్నో ఉన్నాయి, అవన్నీ సేకరించ వలసి వుంది.

నా చిన్న ప్రయత్నంలో - విశాలమైన బాలసారస్వతంలోని కథల విశిష్టతకు గాని, కథా రచయితల ప్రతిభకు, విలువకుగాని, సరియైన న్యాయం జరిగి వుండక పోవచ్చు. లోపమేదైనా, అది నా ప్రయత్నలోపమే కాగలదని మనవి.

'బాలప్రపంచానికి' 'కథల సంకలనం' ద్వారా నా చిన్నసేవ అందించే వీలు కల్గించినందుకు బాల అకాడమీ యాజమాన్యానికి, సహకరించిన రచయితలకూ, మిత్రులకు కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

పిల్లల పుస్తకం పిల్లల వద్దకు వెళ్లాలి. కథలన్నీ పిల్లలకు ఎంతో కొంత మేలు కూరుస్తాయని విశ్వసిస్తున్నాను.

మండా సూర్యనారాయణ
(మసూనా)

# సమీక్ష

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి పిల్లలకోసం కథా సంకలనాలను ప్రచురించడానికి పూనుకోవడం సమాదరణీయమైన విశేషంగా భావించవచ్చు. నిన్న మొన్నటి దాకా వ్యక్తిగతంగా ఎవరో ఒకరిద్దరుతప్ప పిల్లల పాల మనస్సుల్లో పొంగులు వారుతున్న తలపుల మీగడలను చూడలేక పోయారు. వాళ్ళల్లో పొటమరిస్తున్న జిజ్ఞాసాంకురాలకు దోహదం కలిగించే ప్రయత్నం తగినంతగా జరుగలేదనే చెప్పాలి పండితుల ఆదరణకు నోచుకోని ఈ బాల సాహితీవల్లరికి దోహదం కల్పించి తరతరాల నుంచి మారాకులు హత్తుకుంటూ పందిళ్ళపైకి ప్రాకించిన గౌరవం జానపదులకే దక్కుతుంది. పిల్లల వినోదానికి, విజ్ఞానానికి వారే కథలల్లిరి. పొడుపు కథలను పిల్లల పిడికిళ్ళలో పెట్టిరి. పాటలు పాడి ఊగించి ఆడించిరి. ఇప్పుడిప్పుడు మన దేశంలోని పండితులు, ప్రచురణ కర్తలు పిల్లల వయస్థారతమ్యాన్నిబట్టి బాల సాహిత్యాన్ని వింగడించి వాళ్ళకు కనువిందు గొలిపి మనస్సులను ఆకట్టుకొని ప్రసరించ గలిగే కథలను, భావాలను, బొమ్మలను ఆడించారు. ఈ ప్రయత్నం పశ్చిమ దేశాలలో రెండు మూడు శతాబ్దాల క్రిందనే ప్రారంభమై ఇప్పుడొక ప్రత్యేక సాహితీ విభాగంగా రూపొందింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బాలల అకాడమీని నెలకొల్పి యుగోచితాగ్ర గామిత్వాన్ని ప్రదర్శించింది. చాలా హర్షింపదగ్గ విషయం. ఇప్పుడీ అకాడమీ పిల్లల కథాసంకలనాలను, గేయ సంకలనాలను ప్రచురించడానికి సమకట్టి భావి పౌరులకు పూల పాటలతోపాటు, పూల బాటలను అందిస్తున్నది.

తమ వైదుష్యంతోనూ, తమ అపార జీవితానుభవంతోనూ, తమ విశిష్టవ్యక్తిత్వంతోనూ, తమ రసనిర్భర సాహితీ సృష్టితోను తెలుగు దేశాన్ని తెలుగు పఠితృలోకాన్ని పునీతం చేసి, రసార్ద్రం చేసిన శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు, శ్రీ గిడుగు సీతాపతి గారు, శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు, శ్రీ అదిరాజు వీరభద్రరావుగారు, శ్రీ మల్లంపల్లి శోమశేఖరశర్మగారు, శ్రీ చింతా దీక్షితులుగారు, శ్రీ కె. సభాగారు, శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు, శ్రీ రావూరి భరద్వాజగారు, శ్రీ ఏడిద కామేశ్వరరావుగారు, శ్రీ నార్ల చిరంజీవిగారు ఇంకా మరెందరో మహానుభావులు పిల్లలకోసం వామనులై భాషలో, శిల్పంలో, వస్తువులో పిల్లలై పిల్లలకు తాతలై కథలుగా కనిపిస్తారు.

కథ అంటేనే చెప్పడం అనే అర్థం స్ఫురిస్తుంది. సంఘటన ఎలాంటిదైనా సరే, అది చెప్పే తీరులో ఒక ప్రత్యేకతను సంతరించుకుంటేనే తప్ప అది కథ అనిపించుకోదు. అందులోనూ పిల్లలకు చెప్పడం వెన్నలాంటి మనస్సుంటేనే తప్ప సాధ్యంకాదు. మనిషికి వెన్నవంటి మనస్సు ఉంటే భాషలో మార్దవం సహజంగానే వస్తుంది. ఈ సంకలనంలో పెద్దలంతా పిల్లల చిన్నారి మనస్సులకు ఆనందంతోపాటు ఆలోచనలను పంచి పెట్టడానికి ప్రయత్నించి కృతకృత్యులైనారు.

ఈ కథలు నన్ను మళ్ళీ బాల్యంలోకి తీసుకపోగలిగినవి. ఇది వీటి గొప్పదనం

ఇరివెంటి కృష్ణమూర్తి

# మనవి

కథలు వింటానూ। నేను।
కలలు కంటానూ —
అమ్మ వొడిలో కమ్మగ కూర్చుని
తీయ తాయిలం తింటూనూ ॥క॥

* * *

ఈ లోకవృత్తం ఓ పెద్దకథ. ఆ కథలో కథలు; ఆ కథలలో కథలు – పరశ్శతాలు! కథలేని లోకవృత్తంలేదు, కథగానే లోకగమనం కొనసాగుతూ వుంటుంది. సృష్టిలోని ఎనభైనాలుగు కోట్ల జీవరాసులు (పెద్దలమాటలలో) ఎనభైనాలుగు కోట్ల కథలు!

ఆ కథలు సుధలే కావచ్చు; వ్యధలే కావచ్చు; సుధావ్యధలే కావచ్చును. వాటిని చెప్పుకొనే రీతిలో వాటి స్వారస్యం ఇమిడి వుంది. ఆ రీతి నీతి మిళితమై, జాతిహృదయాన్ని జాగృతం చేస్తూ వుంటుంది.

మానవ సంస్కృతీ వికాసానికి దోహదం చేసే సమస్తకళలూ కథ లేనిదే రాణించవు. కథా పరిభ్రమణంలోనే కళా వికాసం ఆధారపడి వుంది.

సాహిత్యానికి కథ ఆధారశిల. సర్వకళాసంపన్నమైన సాహిత్య మందిరం ఆ ఆధారశిలపైననే నిర్మితమవుతుంది. అందుకే కథకు అంత ప్రాధాన్యత వున్నది.

కథలు పెద్దలనేకాదు; పిన్నలను కూడా అలరిస్తాయి. అసలు పిల్లలకు కథలే సుధలు. ఈ లోకాన్ని, సంఘాన్ని, కథలలో వారు ఎంతో ఆనందంగా చూడగలుగుతారు. యధార్థగాధలైనా, కాల్పనికాలైనా కథలను వింటూ ఆకలిదప్పులను వారు మరిచిపోతారు.

అందుకే పిల్లల విజ్ఞానాభివృద్ధికి 'కథ'ను ఒక పటిష్ఠమైన ప్రక్రియగా పెద్దలు ప్రయోగించారు. పంచతంత్రంవంటి 'కథల కథ' ఇందుకు ప్రబల తార్కాణం.

అట్టి కథా సాహిత్యాన్ని పిల్లలకు గోరు ముద్దలుగా అందించాలనే తలంపుతో బాలల అకాడమీ చేస్తున్న ప్రయత్నమే ఈ సంకలనం.

ఇట్టి ప్రయత్నానికి సహకరించి, కొన్ని కథలను సంతరించి సంకలనముగా అందించిన శ్రీ మండా సూర్యనారాయణ (మసూనా గారికి, ఈ కథలను సాకల్యంగా సమీక్షించి ఇచ్చిన శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి, చక్కని "చిత్రశీర్షిక" లను రచించిన శ్రీ అమర్ మోహన్‌గారికి, ముద్రణాదికాలంలో సహకరించిన శ్రీ డి. రామలింగంగారికి తదితర మిత్రులకు బాలల అకాడమీ అభివాదముల నందజేస్తున్నది.

—ఏడిద కామేశ్వరరావు
(సంపాదకుడు)

# కథలు - కథకులు


| | | | పుట |
|---|---|---|---|
| 1. వివేకము | —గిడుగు వెంకట సీతాపతి | ... | 1 |
| 2. గంట | —వేలూరి శివరామశాస్త్రి | ... | 3 |
| 3. అమ్మ నన్నెందుకు కొట్టాలి? | —చింతా దీక్షితులు | ... | 6 |
| 4. జట్కా వెంకయ్య | —మల్లంపల్లి సోమశేఖరశర్మ | ... | 10 |
| 5. మిఠాయి చెట్టు | —ఆదిరాజు వీరభద్రరావు పంతులు | ... | 13 |
| 6. ఇరువది ఇద్దరు పిరికిపందలు | — న్యాయపతి రాఘవరావు | ... | 17 |
| 7. కోతుల కోటయ్య | — న్యాయపతి కామేశ్వరి | ... | 22 |
| 8. బంగారు పిచ్చుక | —బి. వి. నరసింహారావు | ... | 26 |
| 9. చెంపకాయ | —రావూరు వెంకట సత్యనారాయణరావు | ... | 30 |
| 10. చిన్ననాటి జ్ఞాపకాలు | —పాలంకి వెంకట రామచంద్రమూర్తి | ... | 33 |
| 11. ముసలమ్మ యుక్తి | — ముళ్లపూడి వెంకటరమణ | ... | 37 |
| 12. రావణునికి శుభలేఖ | — చేకుమళ్ల కామేశ్వరరావు | ... | 38 |
| 13. ఈశ్వరచంద్రుడు-నవయువకుడు | — జంధ్యాల పాపయ్యశాస్త్రి | ... | 40 |
| 14. కిం-కం-మాపసెద్దు కొమ్ము, నీరొమ్ము ధం | — అంతటి నరసింహం | ... | 42 |
| 15. బహుమతి | — మండా సూర్యనారాయణ | ... | 46 |
| 16. జేబుదొంగ | —మద్దిపట్ల వెంకటరావు | ... | 49 |
| 17. తెడ్డు రహస్యం | —అంట్యాకుల పైడిరాజు | ... | 52 |
| 18. పనికిమాలిన ప్రోత్సాహం | —వసుంధర | ... | 56 |
| 19. నరుడు- వానరుడు | —పడిద కామేశ్వరరావు | ... | 61 |


(P. T. O.)

| | | |
|---|---|---|
| 20. కిట్టూ-కిడ్డీ బ్యాంకు | —ఇల్లిందల సరస్వతీదేవి | ... 67 |
| 21. చిన్నారి కలలు | —తటవర్తి వెంకట జ్ఞాన ప్రసూన | ... 72 |
| 22. గోపీ ఆపిన రైలు | —నండూరి సుబ్బారావు | ... 75 |
| 23. పుణ్యఫలం | —సింగంపల్లి అప్పారావు | ... 79 |
| 24. నీతిని మింగిన చపాతీ | —వాకాటి పాండురంగారావు | ... 83 |
| 25. చైనాదేశం మంత్రి | —సూరిశెట్టి సాంబశివరావు బాబ్జీ | ... 87 |
| 26. అక్కయ్య జాబు | —అలపర్తి వెంకటసుబ్బారావు | ... 90 |
| 27. బాలవీర్ జాలిమసింహ | —ఘనమూర్తి | ... 96 |
| 28. బంగారు గొలుసు | —ఎమ్. శంకర్రావు | ... 98 |







ఒక చిట్టడవిలో కుందేళ్ళు, అనగా చెవుల పిల్లులు మెండుగా ఉండేవి. వాటిని పట్టుకొనుటకుగాని, వేటాడుటకుగాని చుట్టుపట్టులనున్న గ్రామములవారు పోవుచుండేవారు. చెవులపిల్లి మాంసము కొందరికి యిష్టము. వారు వేటకై పోయి చెవులపిల్లి కనబడగానే తుపాకీ పేల్చిగాని, బాణము వేసిగానీ దానిని చంపి తీసుకొనిపోవుదురు. కొందరు దానిని నేర్పుతో పట్టుకొనుటకు వలలుపన్ని చేరువగా ఒక చెట్టుచాటున దాగి యుందురు.

ఒకనాడు ఆ చిట్టడవికి రెండుక్రోసుల దూరమునగల రామనగర మను పెద్ద గ్రామమునుండి నలుగురు పిల్లలు పదిపంద్రెండు ఏండ్ల ఈడు గలవారు వలసామాగ్రితో వచ్చి కుందేటివేటకు కావలసిన పనులుముగించి ఒక చెట్టుచాటున దాగియుండిరి. వారిలో పదియేండ్ల బాలుడు తెలివి తేటలుగలవాడే కాని గచ్చపొదవలె వటవటవాగుట కలవాటుపడినవాడు. అందుచేత అతనితో తక్కిన ముప్పురును "నీవు మాటలాడక నిశ్శబ్దముగ ఉండవలెను సుమా! నీవు మాటలాడినయెడల చెవులపిల్లులు మనమిక్కడ

అడవిలో ఏవైపుగా పోయిమేస్తుందో కిట్టమ్మకు యిప్పుడు తెలియడం లేదు. ఎంచేత? దాని మెడలో గాణిగె లేదుగా! అదేగనుక ఉంటే అది టింగు టింగుమనేది. ఆ చప్పుడునుబట్టి అది ఎక్కడ ఉన్నా కిట్టమ్మకు తెలిసేది. కామమ్మ మేస్తూ మందకు చాలాదూరంగా పోయింది. ఆ కొత్తవాడి పన్నాగం పండింది. వాడు మాటాడకుండా దాన్ని తోలుకుని చక్కా పోయాడు.

'ఎక్కువ కొడబడు నేర్పాటులోని
తక్కిడి కలదని తలపుము లోన'

× × ×

ప్రొద్దువాలింది. ఆలమంద యింటికి మళ్ళింది. సగందూరం వచ్చాక కిట్టమ్మ మందనంతా ఒకసారి చూచుకున్నాడు. కామమ్మేది? దాపలా వెలపలా వెతికాడు. "కామమ్మా" ఒకసారి బిగ్గరగా అరిచాడు పొదలలో కళ్ళుపెట్టి చూచాడు. అది ఎక్కడా కనబడలేదు. వాడికి ఏడుపు వచ్చింది. కళ్ళు ఉబ్బినై. మొహం అంతా ఎర్రబడ్డది. వాడు అలా ఏడుస్తూనే జరిగినదంతా తల్లిదండ్రులకు చెప్పుకున్నాడు. వాళ్ళు తెల్లబోయారు. వాడు ఎత్తుకుపోవడానికే ఎత్తువేసి పదిరూపాయలు నాచేతిలో పెట్టాడని నేను కనిపెట్టలేకపోయానని కిట్టమ్మ మొత్తుకున్నాడు. అప్పుడు వాని తండ్రి యిలా అన్నాడు: "ఆ దొంగ నిన్ను మోసగించినట్లే పాపం కూడా మనను మోసగిస్తుంది. అది ఏదో లాభంచూపి మన మతి మారుస్తుంది. మనం దాని వలలో పడిపోతాం. క్రమక్రమంగా పాడైపోతాం. నీవు దానికి నీవేలు చూపించావో, అది కేలు మింగిందన్నమాటే! అది గుర్తుంచుకో".

"రవ్వంత చెడ్డలో ప్రాలితివేని
కొండంత మంచికి గొందువు హాని"

కిట్టమ్మ తల్లి యిలా అంది : "మన తాతముత్తాతల నాటినుండి ఆవు మెడలో గంటకట్టే ఆచారంవుంది. దీనివల్ల ఎంతమేలు ఉన్నదో నీకు తెలియదా?". "ఆ రూపాయలు చూసేసరికి నాకళ్ళు చితతలు కమ్మినవి. అవి ఊరికే ఒళ్ళో వచ్చిపడుతున్నట్లనిపించింది. అదీగాక గంటవల్ల

పాలు ఎక్కువ ఈయదుగా! కాబట్టి దీనివల్ల ఉపయోగంలేదు. ఇది దండగ అని తోచింది. కాని ఆవు కనబడకపోయేసరికీ, అరెరె గంటవల్ల ఎంత ఉపయోగం ఉందిరా! అని తెలిసొచ్చింది" అని కిట్టమ్మ అన్నాడు. "మంచిది, ఇప్పుడైనా తెలిసినందుకు సంతోషం. తెలివితక్కువవాండ్లు వలలోపడటం ఈ మోస్తరే. పాత ఆచారాలు పనికిరానివి అని అనేవాళ్లు తమకు అనుభవంలోకి వచ్చిన తరువాత పస్తాయిస్తారు. మన తాతలు ముత్తాతలు మంచి అనుభవాలమీదనే ఈ ఆచారాలు పెట్టారని తెలుసు కుంటారు"అని కిట్టమ్మ తల్లి అన్నది.

"తొలుతటి వాడుకల్ తొలగింపబోకు
వలసిన మేలు కావలెనేని నీకు"

(కానన్ ఖ్మిడ్‌కు అనుసరణం)



దాన్ని నిలువునా చింపి మాంచి తోక చేశాను. అంతే! మరి అమ్మ నన్నెందుకు కొట్టాలి ?

కొత్త పొత్తుపంచ చింపానని అమ్మ నన్ను కొట్టిందట. అసలిది కొత్త పొత్తుపంచా ఏమిటి ? పాత పొత్తుపంచ చింపితే కొత్త పొత్తుపంచ అని అమ్మెందుకు అనాలి ? నేనే చేశానేమిటి ? అసలు వెంకి తనకి తోక కావాలని చెప్పొచ్చు కామోసు ? తోక మరచిపోయామని సూరి మాత్రము అనలేదా ఏమిటి ? పెద్దపులికి తోక లేకపోతే బాగుంటుంది కాబోలు ! మరి పెద్దపులికి తోక లేకపోతే పెట్టడం తప్పు కామోసు ? అమ్మ నన్నెందుకు కొట్టాలి ?

అప్పుడు మళ్ళీ నేను వెంకితో గాండ్రు గాండ్రు మనవే అని చెప్పితే సూరి అననిచ్చిందా ఏమిటి ? అననివ్వకుండా అంది కదా "సీతీ, సీతీ మరి పెద్దపులిని మనమిద్దరము పట్టుకోవద్దులే" అంటే, నేనన్నాను గదా "అక్కయ్యా మనింట్లో గొలుసులెక్కడున్నాయమ్మా" అని.

అప్పుడు నాన్న పరుపుకు కట్టుకొనే తాడు తెచ్చి వెంకి నడుముకి బిగించాము. ఒకకొన నేను పట్టుకుంటే సూరిమాత్రం పట్టుకోలేదు కామోసు ఇంకోకొన ? అమ్మ నన్నెందుకు కొట్టాలి? నేనేం జేశానేమిటి ?

అప్పుడు వెంకి "జణక జంజం జణక జంజం"అని ఆడింది. మేము తాళ్ళతో దాన్ని ఇలాగా అలాగా లాగాము. ఎంతో గమ్మత్తుగాఉంది. అప్పుడు మళ్ళీ వెంకి అందికదా "చెవులేవీ ?"అని. "అవునే, సీతీ, మరి పెద్ద పులి తల పెడితేనేగాని పెద్దపులి ఎలా అవుతుందే ?" అని సూరి అంది. అప్పుడు నేను అన్నయ్య టోపీ తెచ్చి దానికి తెల్లచారలు పచ్చచారలూ పెట్టి రెండు గుడ్డపీలికలు చెవులకిందపెట్టి వెంకి తలమీద పెట్టాను. టోపీ తగలేశానని అమ్మ కొట్టిందట. సూరి తగలెయ్యలేదు కామోసు. అమ్మ నన్నెందుకు కొట్టాలి ? నేనేమన్నా పెట్టుకొన్నానా ఏమిటి ఆ టోపీ ? వెంకి పెట్టుకుంటే వెంకినేమీ అనలేదుగాని నేనేమన్నా పెద్దపులి వేషం వేశానా ఏమిటి ? అమ్మ నన్నెందుకు కొట్టాలి ? నేనేం చేశానేమిటి ?

వెంకి టోపీపెట్టుకొని గాండ్రు గాండ్రుమంటూ అరుస్తూ నోరు తెరిచి "మింగేత్తా, మింగేత్తా" అంది. మేము తాడు పట్టుకొని చుట్టూ

తిరుగుతూ "అమ్మో! పెద్దపులే, భయమేస్తుంది! మింగేస్తుందిటే, అమ్మయ్యో పెద్దపులే" అన్నాము.

వెంకి మళ్ళీ గట్టిగా గాండ్రు గాండ్రుమంటూ మామీద పడబోతుంటే మేం తప్పించుకొన్నాం. ఇలాగ ఆడుకొంటూంటే అమ్మకి వినిపించింది. వెంకి గాండ్రు గాండ్రుమంటూంటే అమ్మవిని వచ్చింది. వచ్చి నన్నెందుకు కొట్టాలి అమ్మ? నేనన్నానా ఏమిటి గాండ్రు గాం డుమని? వెంకి అంటే దాన్నేమీ అనలేదుగాని.

అమ్మ రావడంతోనే సూరి పారిపోయింది. నేను పారిపోకుండా ఉన్నానుగదా! మరి అమ్మ నన్నెందుకు కొట్టాలి?

నానొచ్చాక చెప్పనా ఏమిటి? నానొచ్చాక నాన్నదగ్గరికెళ్ళి అంటాను కదా "నాన్నా, నాన్నా, అమ్మ నన్ను కొట్టింది నాన్నా, నేనేం జెయ్యలేదు నాన్నా, ఊరికే ఉత్తిపుణ్యానే కొట్టింది నాన్నా" అని నాన్నతో చెప్పనా ఏమిటి?

అమ్మ నన్నెందుకు కొట్టాలి?" -



డబ్బు విషయంలో కావలిస్తే నేను సహాయం చేస్తాను" అని రామ్మూర్తి చెప్పాడు.

వెంకయ్య పిల్లలకి చదువు చెప్పించాడు. వాళ్ళు చిన్నప్పటినుంచి బాగా చదువుకున్నారు. రామ్మూర్తి వాళ్ళకి పెద్దచదువులకయ్యే డబ్బు భరించాడు. వెంకయ్య పిల్లలు చక్కని అలవాట్లు చిన్నప్పటినుంచి అలవర్చుకుంటూ చక్కగా చదువుకుని గొప్పవారయినారు.








గోపి ఒక పాలేరు పిల్లవాడు. వాడు తనతల్లి మేకలను తోలుకొని అరణ్యమునకుపోవును. వాడొక చెట్టుపై కూర్చుండి, సంతోషముతో పాటలు పాడుచుండును

ఒకనాడు గోపి తన తల్లివద్దకుపోయి "అమ్మా! నాకు జీడిపప్పు మిఠాయి చేసిపెట్టవే" అని బ్రతిమిలాడెను.

ఆతల్లి జీడిపప్పు, బెల్లము కొనెను. బెల్లము పాకముపట్టెను. అందు జీడిపప్పు కలిపి ఉండలు కట్టెను. గోపికి పెట్టెను. వాడు తృప్తితీర తినెను రెండు ఉండలను మూటగట్టుకొని మామూలుగా అడవికి పోయెను. అచ్చట భూమిలో ఒక గొయ్యిత్రవ్వి ఒకఉండను గోతిలో పూడ్చి "తెల్లవారేవరకు నీవు మొలవకపోయినట్లయితే, మా మామయ్య పార తీసుకువచ్చి నిన్ను త్రవ్వి పారవైచెదను" అని గంభీరముగా నుడివెను. అట్లు, దానిని బెదరించి వాడు యింటికి పోయెను.

మరునాడు వెళ్ళి చూచెను. మిఠాయిచెట్టు మొలచియుండుట చూచెను. "ఓ మిఠాయి! నీవు రేపటివరకు కొమ్మలు, ఆకులు వేయక పోతివా మా మామయ్య గొడ్డలి తీసుకువచ్చి నిన్ను నరికివైచెదను

"బాలకా! నీకెంత అందమయిన పండ్లున్నవి" అనుచు ఆమె వాని దంతపరీక్ష చేసి ఎంతో ముచ్చటపడెను.

"అయ్యో! నాకట్టి చక్కని పండ్లులేవుగదా!" అని కోడలు నిట్టూర్పు విడిచెను.

"నీకు మంచి పండ్లు ఎట్లు లభించగలవో తెలిపెదను. నీవొక్క నిముషముసేపు భూమిపై పరుండుము" అని గోపి ఆమెతో చెప్పెను. ఆ కోడలు భూమిపై పరుండెను. తన్ను చంపుటకు తెచ్చిపెట్టిన కత్తిని తీసుకొని దాని మెడ నరికెను. ముసలిదానికికూడా బుద్ధిచెప్పవలెనని గోపి తలచెను. కావున కోడలు కట్టుకున్న దుస్తులను ధరించి, ఆమె సొమ్ములు పెట్టుకొని మొగముమీదుగ మేలిముసుగు వేసికొనెను. కోడలిని నరకి కూరలు, పులుసు తయారుచేసెను. ముసలిదానికొరకు వేచిఉండెను. ముసలిది మిత్రులందరను పిలుచుకొని భోజనమునకు వచ్చెను. గోపి వారికందరకు వడ్డనచేసెను. అందరు భోజనములు చేసిన తరువాత, ముసలి మాయావి "కోడలా! ఏటికిపోయి స్నానము చేసివచ్చి భోజనము చేయుము" అని చెప్పెను.

"గోపి వట్టికుండ నొకదానిని తీసుకుపోయి దాని సహాయముతో నదిని ఈది ఆవలిగట్టున చేరెను. తరువాత కోడలి దుస్తులను విడిచివేసి, తన దుస్తులను ధరించెను. కోడలి సొమ్ములన్నింటిని మూటగట్టి తన తల్లికిచ్చుటకు సంకల్పించుకొనెను. ముసలిది వినునట్లుగా ఆవలిగట్టునుండి వాడిట్లు అరచెను — "ఓ మాయలమారి ముసలిదానా, నీ కోడలినే నీవు తినునట్లు చేసినాను. మొత్తుకో! మొత్తుకో!" అని వ్రేలితో బెదరించుచు పరుగెత్తిపోయెను.

ఆ బాలుని చూచియు, వాడు చేసినపని తెలిసికొనియు ఆ ముసలిది నిర్ఘాంతపడి పోయెను.






ఆ ఊళ్ళోకల్లా రాజారావుగారి బంగళా చాలా పెద్దది. బంగళాచుట్టూ ఖాళీస్థలం ఎంతోవుంది. ఆ ఖాళీస్థలంలో ప్రతిరోజూ ఎందరో బాలలు ఆడుకుంటూ ఉంటారు.

రాజారావు తరచు ఆ బంగళాలో ఉండరు. మదరాసులోవుంటూ ఉంటారు. ఆ బంగళా కాపరి ఒక ముసలితాత, అంచేత ఆ చుట్టుప్రక్కల వున్న పిల్లలందరూ ఆఖాళీస్థలంలో ఆడుకుంటూవుంటారు.

రాజారావుగారికి పెద్ద గండుమీసాలు వుంటాయి. ఆయన్ని చూస్తేనే అందరికీ హడల్! అంచేత రాజారావుగారు ఊళ్ళోవుంటే ఆ చోటికి ఎవ్వరూ ఆడుకునేందుకు వెళ్ళేవారుకాదు.

ఒకనాడు సాయంత్రం మోహన్ జట్టుకి, కిష్టయ్య జట్టుకి ఫుట్ బాల్ పోటీపడింది. రెండు జట్లూ రాజారావుగారి బంగళా ఆవరణలో ఆట ప్రారంభించారు. మోహన్ బలే ఆటగాడు. బంతి తనదగ్గరికి వస్తే ఒక్క తోపుతో ఆకాశంమీదికి పంపేవాడు.

ఆ ఇరువది యిద్దరు ఆటగాండ్రు ఆరోజున ఫుట్ బాల్ బలే హుషారుగా ఆడుతున్నారు. ఇంతలో తలవని తలంపుగా రాజారావుగారు

క్యాంపునుండి తిరిగివచ్చారు. దూరంగా కారు హారన్ వినిపించగానే పిల్లలు దౌడుతీశారు. మోహన్ తన దగ్గరవున్న బంతిని కాలితో ఒక్క దెబ్బకొట్టాడు. ఆదెబ్బకి ఆ బంతి ఎగిరి, తిన్నగా బంగళా అద్దాల కిటికీకి తగిలింది. అద్దం ఫెళ్ళున బద్దలయింది.

ఇరవై ఇద్దరు బాలలూ ఒక్క క్షణంలో మాయమయిపోయారు. రాజారావుగారు కారుదిగగానే అక్కడ ఒకబంతి పడివుండడంచూశారు. కిటికీ అద్దం పగిలిఉంది! ఆ కోపంతో మండిపడుతూ ఇటూఅటూ చూశారు. ఒక్క కుర్రాడేనా కనబడితేగా!

మోహన్ పరుగెత్తుకుంటూ ఇంటికి వచ్చేశాడు. ఒగుర్చుకుంటూ కంగారుగా ఒక కుర్చీలో కూలబడ్డాడు. వాళ్ళ నాన్న మోహన్‌నిచూసి "మోహన్। ఏమిటి ఈ కంగారు! ఏమిటి జరిగింది ?" అని అడిగారు.

"ఏమీలేదు నాన్నగారూ!"

"ఏమీ జరగకపోతే ఇలాగెందుకు ఒగర్చుకుంటూ వస్తావు? నిజం చెప్పు."

"మేము రాజారావుగారి బంగళాలో ఫుట్ బాల్ ఆడి వస్తున్నాం నాన్నగారూ! అంతే."

అంతే అంటావేమి? ఇంకా ఏదో జరిగిఉంటుంది. మీబాల్ తగిలి కిటికీ అద్దం పగిలిందా ?"

"మీకెలా తెలిసిందండీ ?"

"మేముకూడా చిన్నప్పుడు అక్కడే ఫుట్‌బాల్ ఆడేవాళ్ళం. ఎన్నోసార్లు మేముకూడా ఆఅద్దాలు పగలగొట్టేవాళ్ళం......... మీరు కూడా అద్దం పగులగొట్టారన్న మాట! తరువాత?........."

"తరువాత రాజారావుగారు అప్పుడే ఊరునించి రావడంచూసి మేం భయపడి పరుగెత్తుకుంటూ వచ్చేశాం."

"ఏమిటీ! మీరందరూ పరుగెత్తుకుంటూ వచ్చేశారా? అందరూనా?"

"అవును. అందరం"

"మీరందరూ ఎందరు?"

"రెండు జట్లు, ఇరవై ఇద్దరం!"

"ఇరవై ఇద్దరు పిరికిపందలు పరుగెత్తుకొని వచ్చేశారన్నమాట ఒక్కరేనా అక్కడ ధైర్యంగా ఉండలేదా?"

"బాబోయ్! అక్కడ ఉండడమే! అందరం వచ్చేశాము."

"ఆబంతి ఎవరుకొట్టారో ఆ అబ్బాయేనా ఉండలేదా?"

"నేనే ఆ అబ్బాయిని, నేనే ఆ బంతిని కొట్టాను."

"ఓహో! అయితే నువ్వు పరమపిరికి వాడవన్నమాట!... నువ్వీ ఏమి చెయ్యాలో తెలిసిందా? తిన్నగా రాజారావుగారి దగ్గరకెళ్ళి క్షమాపణ కోరుకోవాలి."

"బాబోయ్! రాజారావుగారి దగ్గరికే! ఆయన నన్నుచూస్తే చంపేస్తాడు."

"లేదు. చంపడు. నువ్వు ధైర్యంగా వెళ్ళి, 'అయ్యా! నేనే మీ అద్దాల కిటికీ పగులుటకు కారణం' అని చెబితే అతడు క్షమిస్తాడు. రేపు పొద్దున్నే నువ్వు వెళ్ళి క్షమాపణ కోరుకోవాలి!"

మోహన్ తండ్రి చెప్పిన మాటకు తిరుగులేదు. మోహన్‌కి ఆ రాత్రికి నిద్రపట్టలేదు. కలలో తను రాజారావుగారి దగ్గరికి వెళ్ళినట్టు, రాజారావుగారు సింహంలాగ గర్జించి తనని కొరడాతో కొట్టినట్టు కల వచ్చింది. ఎలాగో తెల్లవారింది.

"నాన్నా! నేను ఒక్కడిని వెళ్ళడానికి భయంవేస్తోంది."

"సరే, అయితే నేనుకూడా వస్తాను పద. నేను బంగళా గేటువరకు వస్తాను. బంగళాలోనికి నువ్వు ఒక్కడివి వెళ్లాలి."

"సరే"

ఇద్దరూ రాజారావుగారి బంగళాకి వెళ్లారు.

మోహన్ మెల్లగా నడుస్తూ మెట్లు ఎక్కాడు. బంగళా హాల్లో సోఫామీద రాజారావుగారు పేపరు చదువుకుంటున్నారు. మోహన్ మెల్లగా వెళ్లాడు.

"సార్!"

"ఎవరది?"

మోహన్ చెవిలో ఒక పిడుగు పడినట్లయింది.

"నేను సార్! నిన్న సాయంత్రం మీ అద్దాల కిటికీ పగులగొట్టిన వాడిని నేనే. మీ క్షమాపణ కోరేందుకు వచ్చాను."

రాజారావుగారు ఆ మాటలు విన్నారు. కాసేపు నిశ్శబ్దం. మోహన్‌రావు గజగజ ఒణుకుతున్నాడు.

రాజారావుగారు సోఫానుంచి లేచారు. మోహనరావు దగ్గరకు వచ్చారు. వీపుమీద చేయివేసి "అబ్బాయీ! భయపడకు! నిన్ను క్షమించాను. నీవంటి అబ్బాయిని నేను ఇదివరలో ఎవరినీ చూడలేదు. నిన్ను కన్న తల్లిదండ్రులెవరో!"

"మానాన్న వీధిలోనే నిలుచున్నాడు."

"ఓహో! అలాగా!" అంటూ రాజారావుగారు బయటికి నవ్వుతూ వచ్చి మోహన్ నాన్నగారిని లోనికి ఆహ్వానించారు.

"అయ్యా! నా బంగళా అద్దాలు ఎన్నోసార్లు ఎందరో పిల్లలు పగలగొట్టారు. ఒక్కరూ నీకొడుకుమాదిరిగా వచ్చి తాను చేసిన తప్పును

ఒప్పుకోలేదు. నీకొడుకు ధైర్యానికి మెచ్చాను. ఇదిగో వానికి ఈ ఫౌంటెన్ పెన్ బహుమతిగా యిస్తున్నా''అని మదరాసులో తాము కొన్న సరికొత్త పెన్నును బహుమతిగా ఇచ్చారు.

మోహన్ ముఖం విప్పారింది. తండ్రివంక, రాజారావుగారివంక చూశాడు ఎంతో సంబరపడుతూ.






అనగా అనగా ఒక ఊళ్లో 'కోటయ్య' అని ఒక కోతుల నాడించేవాడు ఉండేవాడు. వానిని అందరూ 'కోతుల కోటయ్య' అని పిలిచేవారు. ఆ కోతుల కోటయ్యదగ్గర రెండు కోతులుండేవి. రోజూ ఆరెండుకోతులకూ మెళ్లో తాళ్లుకట్టి. ఆడించడానికి వీధుల్లోకి తీసుకువెళ్లేవాడు. ఒక చేతిలో డోలు, ఇంకొకచేతిలో చిన్న బెత్తం పట్టుకొని, రోడ్డుప్రక్కన చెట్టుక్రింద డోలు వాయించేవాడు.

'రండోయ్! రండోయ్! రారండోయ్!
కోతుల తమాషా చూడండోయ్!
కోతుల నాటకం చూడండోయ్!
చూచి ఆనందించండోయ్!
రండోయ్! రండోయ్! రారండోయ్!

అంటూ డోలు వాయించేవాడు ఆ కోతులకోటయ్య. ఆ డోలువిని, జనం వచ్చి చుట్టూ మూగేవారు.

కోటయ్య, ఆకోతుల్లో ఒకదానికి 'రామయ్య'అనీ, రెండవదానికి 'సీతమ్మ'అనీ పేరుపెట్టాడు. రామయ్య కోతికి చిన్న పంచెకట్టి, చొక్కా

తొడిగేవాడు. సీతమ్మ కోతికి చిన్న చీరకట్టి, రవికె తొడిగి, మెళ్ళో పూసలూ అవీ వేసి, ముస్తాబు చేసేవాడు.

కోతులకోటయ్య డోలువాయిస్తూ 'రామయ్యా! అడవికి వెళ్ళు' అని, తన చేతిలోఉన్న బెత్తంచూపుతూ అనగానే, వెంటనే రామయ్య కోతి టక్ టక్ టక్‌మంటూ నడిచివెళ్ళేది. 'ఇదిగో సీతమ్మా! నీరాముడు అడవికి వెళ్ళిపోతున్నాడు' అనగానే, సీతమ్మకోతి, చప్పున పరుగెత్తు కుంటూ వెళ్ళి, రామయ్యకోతి కాళ్ళకు అడ్డంగా పడుకొనేది.

'అశోక వనంలో సీత ఎలా కూర్చుంది?' అని కోటయ్య అడగ్గానే, ఆ సీతమ్మకోతి, విచారంగా తలవంచుకొని కూర్చుని, వెక్కి వెక్కి ఏడుస్తూన్నట్లు నటించేది. అంతేకాక, ఇంకా డాన్సులు, కుప్పిగంతులు, ఎన్నో వినోదాలు ఆ కోతులచేత చేయించేవాడు. ఇవన్నీచూచి, అక్కడ చుట్టూ మూగిన పిల్లలూ పెద్దలూ ఎంతో ఆనందించి, తలో ఐదుపైసలు పది పైసలూ కోటయ్య డబ్బాలో వేసేవారు.

అక్కడనుంచి కోటయ్య తన కోతులను తీసుకొని మరో వీథికి వెళ్ళేవాడు. అక్కడ రోడ్డుప్రక్కన నిలబడి డోలుకొట్టేవాడు. ఆకోతులని చూచి జనం గుంపులు గుంపులుగా చేరేవారు. మళ్ళీ ఆ కోతులచేత ఆడించేవాడు. మళ్ళీ డబ్బు సంపాదించేవాడు.

ఇలాగ కోతుల కోటయ్య పొద్దుట్నుంచీ సాయంత్రంవరకు ఆ కోతులకు కొంచెంకూడ విశ్రాంతి యివ్వకుండా గెంతించి, రోజుకి సుమారు పది, పదిహేను రూపాయలు సంపాదించేవాడు. ఇలా కొన్నిరోజులు గడిచాయి. ఓసారి కోతుల కోటయ్య ఒక్కకోతినే తీసుకువచ్చి ఆడిస్తున్నాడు. అక్కడ చూస్తున్న జనం 'అదేమిటయ్యా! ఎప్పుడూ రెండు కోతులను తీసుకువచ్చేవాడివే! ఈరోజు ఒక్కకోతినే తీసుకువచ్చావేం?' అని అడిగారు.

'ఏంచేయను బాబయ్యా! ఈ పాడుకోతులు చెప్పిన మాట వింటేనా? చెప్పినపని చేయకపోతే, ఈ కర్రతో ఒక్కటిచ్చుకున్నాను. దాంతో అది చచ్చింది' అన్నాడు కోతుల కోటయ్య కొంచెమైనా జాలి లేకుండా.

'మరి యీ కోతికూడా చచ్చిపోతే' అని అడిగాడు ఒక పిల్లవాడు ఎంతో జాలిగా.

'ఎందుకు చస్తది బాబయ్యా! ఒకవేళ చచినా, ఇంకో కోతిని తెస్తాను. నా పనే అది' అని ఎంతో తేలిగ్గా జవాబిచ్చేశాడు కోటయ్య.

ఆ సీతమ్మ కోతికే డ్రెస్సుమార్చేసి, లంగా తొడిగి, రవిక తొడిగి, చిన్న జరీబట్ట పమిటవేసి, ఆకోతిని జనానికి చూపిస్తూ, 'చూశారా యీ కోతి! దీని పేరు రంభ. ఈ రంభ భరతనాట్యం చేస్తుంది. చూడండి' అని 'ఏదీ రంభా! భరతనాట్యం చెయ్యి' అని డోలు వాయించాడు. భరత నాట్యం డ్రెస్సులోఉన్న ఆకోతి, నిలబడలేక నిలబడలేక, ముందు రెండు కాళ్ళు పైకెత్తి, వెనుక కాళ్ళమీద నిల్చుంది.

'ఊ...గెంతూ' అంటూ కర్రచూపి బెదిరించాడు కోటయ్య. పాపం ఆకోతి గెంతడానికి ప్రయత్నించింది. కాని గెంతలేకపోయింది. ఏదో బాధతో ఉన్నట్లు కనిపించింది. కోటయ్యకు కోపంవచ్చింది. తన బెత్తంతో ఆకోతి తలమీద గట్టిగా ఒక్కటి వేశాడు. దాంతో ఆ కోతి, క్రిందపడి విలవిల కొట్టుకుంది. జనమంతా జాలిగా చూస్తూ, గుంపులుగా నిల్చున్నారు. ఇంతలో అక్కడికి ఒక కారు వచ్చి ఆగింది. కారులోనుంచి ఓ పెద్దమనిషి దిగి, కోతి దగ్గరకువచ్చి చూచాడు.

'ఏమయ్యా, కోటయ్యా! నోరులేని ఆ అమాయకపు కోతిని ఎందుకు అంతగట్టిగా కొట్టావ్? ఈ కర్రతీసుకొని, నిన్నొకటి కొడితే ఎలా ఉంటుంది? ఆనోరులేని జీవిని నీవు హింసించినట్లు, నిన్ను హింసిస్తే?' అని గట్టిగా కోపంతో అరిచాడు. పెద్దమనిషి ఎవరా? అని జనం అంతా చూస్తున్నారు. అతను ఒక పశువుల డాక్టరు. పశువుల ఆసుపత్రికి వెడుతూ వెడుతూ, దార్లో యీ దృశ్యం చూశాడు.

అతడు నెమ్మదిగా ఆకోతిని తనఒడిలోకి తీసుకొని, దాని ఒళ్ళంతా పరీక్షించి చూచాడు. కోతికి అరికాలులో చిన్న ముల్లు విరిగింది. తలమీద కొట్టిన దెబ్బకు బాగా గాయం పడింది.

'ఇదిగో, కోటయ్యా చూశావా! దీని కాలిలో ముల్లు. పాపం ఆ కోతిని గెంతమంటే అది ఎలా గెంతగలదు? నోరులేని జంతువు దాని

బాధ ఎలా చెప్పగలదు ? పైగా, తలమీద ఇంతపెద్ద గాయం పడేటట్లు కొడతావా ? నీ డబ్బు సంపాదనకని, దీన్ని హింసిస్తావా ? దుర్మార్గుడా! ఆ దెబ్బ నిన్ను కొడితే నీకెలా ఉంటుంది?" అని చీవాట్లుపెట్టి. ఆ డాక్టరు చికిత్సచేయడానికి ఆ కోతిని కారులో ఆసుపత్రికి తీసుకుపోయాడు.

కోతుల కోటయ్య భయంతో గుడ్లప్పగించి చూస్తూ, నిలబడి పోయాడు. అక్కడ నిల్చున్న జనం అంతా కోతుల కోటయ్యవైపు చరచర చూస్తూ తిట్టుకుంటూ వెళ్ళిపోయారు.






అనగనగా ఒక బంగారు పిచ్చుక ఉండేది. అది పట్టునారతో ఒక చక్కని గూడు అల్లుకుని అందులో మెత్తని ఈకలు పరుచుకొని ముద్దు వచ్చే రెండు ముత్యాల గ్రుడ్లు పెట్టుకుంది.

ఒకనాడు పిచ్చుక మేతకు వెళ్లడం చూచి, ప్రక్కనున్న పల్లెటూరు కుర్రవాడు ఒకడు మెల్లగా వచ్చి, ఆ గూటిని గ్రుడ్లతో సహా దొంగిలించుకు పోయాడు.

పిచ్చుక తిరిగి వచ్చి చూచుకొంది. గూడులేదు. గ్రుడ్లు లేవు. గోడుగోడున ఏడ్చింది. కష్టపడి అల్లుకున్న గూడూ, కన్న గ్రుడ్లూపోతే ఏడవదూ మరి?

కనపడిన అందరినీ అడగడం మొదలుపెట్టింది పిచ్చుక. "నా గూడు దొంగిలించారా? నా గూడు దొంగిలించారా?" అని. అలా అలా తిరిగే కుక్కపిల్ల నడిగింది: "నా గూడు దొంగిలించావా?" అని. "కుయ్యో మొర్రో నేనెరుగను" అంది కుక్కపిల్ల. ఆడుకొనే ఆవు దూడ నడిగింది పిచ్చుక: "నా గూడు దొంగిలించావా?" అని. "అయ్యో! అంబా! నేనలాంటి పని ఎప్పుడూ చేయను" అంది ఆవుదూడ.

తరువాత పిచ్చుక తుమ్మెద నడిగింది, తూరీగ నడిగింది. చెరువు నడిగింది. చెట్టు నడిగింది. పువ్వు నడిగింది. పిల్లకాల్వ నడిగింది, "నా గూడు దొంగిలించారా? అని. "రామరామ, అలాంటి దొంగపని మేమెన్నడూ చెయ్యం" అన్నారు వాళ్లంతా.

ఇక చేసేదేమీ లేక పిచ్చుక కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. పిచ్చుక ఏడ్పు విని కుక్కపిల్ల, ఆవుదూడ, తుమ్మెద, తూరీగ, చెరువు, చెట్టు, పువ్వు, పిల్లకాలువ ఎంతో జాలిపడి "పిచ్చుకమ్మా! ఏడవకు. నీ గూడు దొంగిలించిన దొంగను పసికట్టి తెస్తాం" అన్నారు.

"దొంగను ఎలా పసికట్టగలరు?" అని అడిగింది పిచ్చుక.

"దొంగైతే నాముందుకేరాడు" అంది కుక్కపిల్ల.

"నా వెనక్కే రాడు" అంది ఆవుదూడ.

"నా రొద విని చెదరగొట్టడు" అంది తుమ్మెద.

"నన్ను పట్టుకొని బాధపెట్టడు" అంది తూరీగ.

"నాగట్టునే నడువడు" అంది చెరువు.

' నా నీడనే నిలువడు" అంది చెట్టు.

"నన్ను త్రుంచి వాసన చూడడు" అంది పువ్వు.

"నన్ను దాటిపోడు" అంది పిల్లకాల్వ.

"ఎందుచేత ?" అని అడిగింది పిచ్చుక.

"దొంగనన్న బెంగచేత, దొరికితే శిక్షిస్తామన్న భయంచేత" అన్నారు వాళ్లంతా.

పిచ్చుకమ్మ వాళ్ల దయకెంతో కృతజ్ఞత తెలిపింది.

"దొంగను పట్టాలి! పట్టితీరాలి" అని వాళ్లు దిక్కులు పిక్కటిల్లే లాగ మూడుసార్లు గట్టిగా కేకలు వేశారు.

గూడు దొంగిలించుకుపోయిన కుర్రవాడు తన ఇంటిలో ఒక మూల ఉన్నాడు. ఈ కేకలు విన్నాడు. కంగారు పడ్డాడు. తనగుట్టు దాగదని భయపడ్డాడు. చేసినపని చాలా చెడ్డదని కూడా గ్రహించాడు. "ఏమిచెయ్యడమా?" అని ఒక నిముషం ఆలోచించాడు. చేసిన తప్పు దిద్దుకోవడానికి, తీసిన గూడును తీసినచోటే గప్ చిప్ మనకుండా పెట్టి రావడానికి నిశ్చయించుకున్నాడు.

కుర్రవాడు పిచ్చుకగూడు చేత్తో పుచ్చుకొని, దొడ్డిదారిని పిల్లి లాగ మెల్లిగా వెళ్లి తీసినచోటునే పెట్టి తిరిగి వస్తున్నాడు. దారిలో పిచ్చుక ఎదురయింది. దాన్ని చూడగానే అతనికి గుండె గతుక్కు మంది. మెల్లగా ధైర్యం తెచ్చుకొని, గొంతుక సర్దుకొని "పిచ్చుకమ్మా! నీ గూడూ, గ్రుడ్లు దొంగిలించింది నేనే. నిజం చెపుతున్నా. వాటిని తీసిన చోటే పెట్టి వస్తున్నా. కోప్పడకు, ఎవరికీ నామీద కోపం కలుగ కుండా చూడు" అని బ్రతిమాలడం ప్రారంభించాడు.

అక్కడనుంచి పిచ్చుక పరుగునపోయి "కుక్కపిల్లా! ఆవుదూడా! తుమ్మెదా! తూరీగా! చెరువూ! చెట్టూ! పువ్వూ! పిల్లకాలవా! విన్నారా, ఈమాట. నా గూడూ, నా గ్రుడ్లూ దొరికినాయి. తీసుకువెళ్లిన ఒక బుజ్జినాన్న తిరిగి తీసుకువచ్చి యిచ్చాడు. అతడు దొంగకాడు దొడ్డ నిజాయితీ కలవాడు. మీరెవరూ అతనిమీద ఆగ్రహించకండి మీరెవరూ శ్రమపడి వెతకడానికి బయలుదేర నక్కరలేదమ్మా" అని మైమరచి చెప్పడం ప్రారంభించింది.

అంతా ఆ మాటలు విన్నారు. "ఆ బుద్ధిమంతుడైన బుజ్జిగాణ్ణి ఒకసారి ఇక్కడకు తీసుకురా! మేమూ చూస్తాం. ఆనందిస్తాం" అన్నారు.

పిచ్చుకమ్మ బయలుదేరింది. ఒక పిలుపు పాట పాడుకుంటూ —

"రావయ్య నా బుజ్జి
రావయ్య తండ్రీ!
నిజము చెప్పిన నీకు నిండు దీవెనలు
తప్పు చేసినవారు ఒప్పుకుంటారా?

నిజము ఘన తెరిగినా నీకె తగుగాక!
మా వారలందరూ మంచి గౌరవము
నీకీయ దలచారు నిక్కముగ, రమ్మ!"

పిచ్చుకమ్మ ఆ కుర్రవాణ్ణి తన మిత్రులందరికీ చూపించడానికి ఆహ్వానించి తోడతెచ్చింది. అందరూ అతని చుట్టూ చేరారు.

కుక్కపిల్ల అపుడూడ చెంగుచెంగున వానిచుట్టూ ఆనందంగా గంతులు వేశాయి. తుమ్మెద ఝుమ్మని గానం చేసింది. తూరీగ పైన ఒయ్యారంగా నాట్యం చేసింది. చెరువు పండుము త్తయిదువులా నిండుగా మురిసి చూసింది. చెట్టు నిలబడి నీడనిచ్చి ఆదరంగా చూచింది. పువ్వు కలకలమని నవ్వి కమ్మగా సువాసన విరజిమ్మింది. పిల్లకాలువ ఉల్లాసంగా ఉరుకుతూ ప్రక్కనే ప్రవహించింది. పిచ్చుకమ్మ ఆపుకోలేని ఆవేగంతో ఆనందాశ్రువులు రాల్చింది.

అందరూ కలిసి ఆ కుర్రవాణ్ణి—

"అందుకో ఓ బుజ్జి—అందాల బాలా!
మా హృదయ కుసుమాల నుంచి ఒక మాలా
నిజము చెప్పిన నీకు నిండు దీవెనలు
కలకాల మీ గాథ ఇలను వర్ధిల్లు.

అని కీర్తించారు.






ఆయన పేరు ఆనందం. ఆస్థి గలవాడు. ఒక్కడే కొడుకు. పేరు భీమన్న.

అది సంప్రదాయాలు 'తు.చ.' తప్పకుండా పాటించే కుటుంబం. చిన్నతనంనుంచీ భీమన్న తండ్రి చెప్పుచేతల్లో పెరిగాడు. కుమారుణ్ణి అన్నివిధాలా గుణవంతుణ్ణి చేయాలని ఆనందం కోరిక. ముఖ్యంగా కుమారుడిలో ఓర్పు వుండాలని తండ్రి ఆశ. ప్రతిదినము కుమారుడి ఓర్పు పరీక్షించాలని ఆనందం అభిమతం. అందుకు ఓ ఉపాయం కని పెట్టాడు.

ప్రతిరోజూ రాత్రి తాను పడుకోబోయేటప్పుడు కుమారుణ్ణి పిలిచి, ఒక్క చెంపకాయ కొట్టేవాడు. కుమారుడు చెంపదెబ్బ తిని, వెళ్ళి పడుకొని హాయిగా నిద్రపోయేవాడు. ఒక్కొక్కరోజున ఆనందం రాత్రి ప్రొద్దుపోయేదాకా కుమారుణ్ణి పిలిచేవాడు కాదు. భీమన్న అప్పటి దాకా మేలుకొని కూర్చునేవాడు. ఎంత నిద్రవచ్చినా ఆపుకొనేవాడు. చెంపకాయ కొట్టిన తరువాత హాయిగా నిద్రపోయేవాడు.

ఇలా చాలా కాలం గడిచింది. భీమన్న పెద్దవాడయ్యాడు. అందగాడయ్యాడు. బలశాలి అయ్యాడు. బుద్ధిమంతుడయ్యాడు. పెళ్ళి ఈడు వచ్చింది. ఒక గొప్పయింటి అమ్మాయిని యిచ్చి పెళ్ళిచేశారు.

ఆవిడ అందగత్తెకూడా! భీమన్న తగిన వసుడని గర్వపడింది. కాపురానికి వచ్చిన తరువాత ఒకటి రెండు రోజులకుగాని తెలియలేదు - అతడు రోజూ తండ్రిచేత చెంపకాయ తింటాడని!

భీమన్న రాత్రిపూట భార్యతోకలసి కబుర్లు చెప్పుకోవడంకోసం ఎంతో సంబరాలు పడేవాడు. కాని, తండ్రి ఎప్పుడు పిలుస్తాడోననే భయంతో నిశ్శబ్దంగా కూర్చునేవాడు. భార్య మాటల్లోకిదింపితే 'ఇస్సు' అని ఆపివేసేవాడు. ఆవిడకు కోపం వచ్చేది— "ఇవాళ మీనాన్న పిలిచినా వెళ్ళవద్దు. ఇన్నేళ్ళు వచ్చి, చెంపకాయలు తినడమేమిటి ?"అనేది, అతడు "అలా అనకూడదు. తప్పు... నన్ను చెంపకాయ కొట్టకపోతే. మా నాన్నకు నిద్రపట్టదు. తినకపోతే నాకు నిద్రపట్టదు. ఆ దెబ్బ తిని వచ్చిన తరువాత నాకు ఎంతో నిబ్బరం వస్తుంది. ఎంత కులాసాగానైనా నీతో మాట్లాడగలను" అనేవాడు.

భీమన్న భార్య ఎంతో చెప్పింది. చెంపకాయ తినడంవల్ల పౌరుషం చచ్చిపోతుందని అన్నది. నా భర్త అలాంటివాడు కావడం నాకిష్టం లేదు అన్నది. ఎన్ని చెప్పినా, ఎంత గోలపెట్టినా, భీమన్న ఆవిడమాట వినలేదు. తండ్రి పిలవగానే పరుగెత్తేవాడు. అతడు దెబ్బ తినడం, భార్య గది గుమ్మంలోనుంచి చూస్తూవుండేది. భీమన్న నవ్వుతూ తిరిగివచ్చి, ఆమెతో సరససల్లాపాలు ప్రారంభించేవాడు.

ఒకరోజు రాత్రి తండ్రి పిలిచాడు. భీమన్నవెళ్ళి చెంప అందించాడు. తండ్రి మామూలుగా కొట్టాడు. వెంటనే భీమన్న ఘొల్లుమన్నాడు. "నాన్నా, నాన్నా !"అని కౌగలించుకొని, దుఃఖించడం ప్రారంభించాడు. తండ్రి ఎంతో బాధపడుతూ "ఏమిటి భీమా ! ఏమిటి ? ఎందుకు ఏడుస్తున్నావు ? దెబ్బ గట్టిగా తగిలిందా ? నొప్పిపుట్టిందా ?" అన్నాడు.

"లేదు నాన్నా ! ఇవాళ మామూలుగా దెబ్బ తగలలేదు. నీ చేతిలో బలం తగ్గిపోయింది. ముసలితనం బాగావచ్చింది. అందుకని ఏడుపు వచ్చింది నాన్నా, నువ్వు చాలాకాలం బ్రతకాలి" అన్నాడు భీమన్న.

తండ్రి అతనిలోగల పితృభక్తికి చాలా ఆనందపడ్డాడు. కుమారునిలో ఓర్పుకు సంతోషించాడు. ఓర్పు పరీక్షించడానికే అలా రోజూ కొట్టానని చెప్పాడు ఆనందయ్య. రోజూ తినే చెంపకాయలో తండ్రిబలం చూచుకొన్నాడు భీమన్న! ఆచూచుకోవడంలో ఎంతో ఓర్పు ప్రదర్శించాడు.

తండ్రి కుమారులమధ్య అనురాగం వర్ణించడానికి ఇదో కథ!

—(చైనా జానపదకథ ఆధారంగా)







# చిన్ననాటి జ్ఞాపకాలు

పాలంకి
వెంకట రామచంద్రమూర్తి

సుమారు నూరేళ్ల క్రితం మధ్య పరగణాలలో 'పగటిచుక్క' అనే బందిపోటు దొంగలనాయకుడొకడు ఉండేవాడు. అతడి క్రింద ఐదువందల మంది అసహాయశూరులు చేరి, అతడేమిచెపితే అదిచేస్తూండేవారు. 'పగటిచుక్క' దోచుకోని ఊరులేదు. కొల్లగొట్టని పల్లెలేదు. పట్టపగలు కూడా దారులవెంట ప్రయాణం చేయటానికి ప్రజలు జడిసేవారు. అతడి మాట జ్ఞాపకం వచ్చిన రాత్రి ఎవరికీ నిద్ర పట్టేదికాదు.

దొరతనంవారు 'పగటిచుక్క'ను పట్టియిచ్చిన వాళ్లకి పదివేల రూపాయల బహుమతి ఇస్తామన్నారు. పదివేలల్లా పాతికవేలదాకా ఈ బహుమతి మొత్తం పెరిగింది. కాని పగటిచుక్కను ఎవరూ పట్టుకోలేకపోయారు. ప్రయత్నం చేసినవాళ్లంతా వాడి అనుచరుల చేతుల్లో పడి ప్రాణాలు కోల్పోయారు.

ఆఖరికి అతనిని ఒక స్త్రీ మాయోపాయంవల్ల పట్టి పోలీసులకు అప్పగించింది. పగటిచుక్క పట్టుబడ్డాడని తెలియటంతోనే ప్రజలందరూ పండుగ చేసుకున్నారు. నేరం వెంటనే విచారణ - ఐపోతుందని, 'పగటిచుక్క'కు జడ్జిగారు తప్పక ఉరిశిక్ష వేస్తారని అందరూ చెప్పుకున్నారు.

ఆలోగా 'పగటిచుక్క' అనుచరులు తమ నాయకుణ్ణి విడిపించుకోడానికి ఎన్నో ప్రయత్నాలు చేశారు. కాని పోలీసులు ప్రత్యేకబందోబస్తు ఎక్కువ చెయ్యడంవల్ల దొంగల ఆటలేవీ సాగాయికాదు.

అప్పుడు వాళ్లొక ఎత్తువేసారు. జడ్జిగారి ఏకైక కుమారుడు షికారుకు వెళ్లి వస్తోంటే అతనిని పట్టుకు తీసుకుపోయి బంధించి, జడ్జిగారికొక జాబు వ్రాసారు: "మా నాయకుడైన పగటిచుక్కను వదిలేస్తేనే, మీ కుమారుడు మీకు దక్కుతాడు 'పగటిచుక్క'కు ఏమాత్రం హాని తలపెట్టినా, మీవాణ్ణి చంపేస్తాము" అని వుంది ఆ జాబులో.

ఆ ఉత్తరం చూసుకున్న జడ్జిగారి కోడలు మామగారి పాదాలపైపడి "నా పతి ప్రాణాలు మీ చేతిలో ఉన్నాయి. మీ కుమారుణ్ణి రక్షించుకుని నాకు పతిభిక్ష పెట్టండి" అని ప్రార్థించింది.

ఆ న్యాయాధికారి ఆమెతో "అమ్మాయీ! ఈ ఆపద సమయంలో ఆ భగవంతుడే మనల్ని రక్షించాలి ధైర్యం వీడకు. అనేక హత్యలూ, నేరాలూ చేసిన 'పగటిచుక్క'కు శిక్ష వెయ్యకుండ ఉండటం ఎలా సాధ్యం? నా ధర్మం నేను నెరవేర్చకపోతే అపఖ్యాతికి, పాపానికి ఒడిగట్టిన వాణ్ణి ఔతాను" అన్నాడు.

మరునాడు జడ్జీగారు కేసు విచారణ చేశారు. తన కొడుకుకోసం అలోచించకుండా న్యాయం ప్రకారం 'పగటిచుక్క'కు వెయ్యవలసిన ఉరిశిక్ష విధించారు.

ప్రజల్ని సమాధాన పరచడంకోసం కోర్టులో జడ్జి తనకు ఉరిశిక్ష విధించినా, లోపాయకారిగా జైలు అధికార్లతో చెప్పి తను పారిపోవడానికి అవకాశం కలుగచేయక పోడనుకున్నాడు పగటిచుక్క. కాని అటువంటిది ఏదీ జరగక పోవడంవల్ల ఆ దొంగల నాయకుడు ఉగ్రుడై, 'సరే కానియ్యి! నాతో పాటు నీ కొడుకూ కూడా చస్తాడు! అప్పుడు వాడికోసం యావజ్జీవం నువ్వూ నీ కోడలూ దుఃఖం అనుభవిద్దురుగాని!' అని న్యాయాధికారిని మనస్సులో తిట్టుకున్నాడు. అంతటితో ఆగక "నన్ను ఉరితీసెయ్యటంతోనే జడ్జీ కొడుకుని చిత్రవధచేసి, ఆ తలకాయను తండ్రి గుమ్మం ముందు పడేసి పోండి" అని దొంగలకు రహస్యంగా ఉత్తరువు పంపేడు. 'పగటిచుక్క'ను ఉరితీసేరోజు వచ్చింది. ఆ ఉదయమే జైలు అధికారి వాడి గదికి వెళ్లి "నీకు కడసారి కోరిక ఏదైనా ఉంటే చెప్పు, తీరుస్తాము" అన్నాడు. 'పగటిచుక్క' తనకేమీ కోరిక

లేవన్నాడు. "అల్లైతే భగవంతుణ్ణి ప్రార్థనచేసుకో ఇంక" అన్నాడు అధికారి. "ఇంతవరకూ నేనెన్నడూ ఆ భగవంతుడనేవాణ్ణి గురించి ఆలోచించలేదు. ఈ ఆఖరి క్షణాలలో మాత్రం నాకు దేవునితో యేంపని" అన్నాడు పగటి చుక్క.

"భగవంతుడు దయామయుడు. నీవు ఈ జన్మలో చేసిన పాపాలన్నీ అతణ్ణి ఒక్కసారి మనసారా ధ్యానంచేస్తే పోవచ్చు. లేకపోతే నువ్వు నరకకూపంలో పడిపోతావు" అన్నాడు అధికారి. "నరకం అనేది ఒకటి ఉంటే అది నాకు ఎలాగా తప్పదు. ఇన్నాళ్లూ లేనిది ఇప్పుడొక సారి ప్రార్థిస్తే నరకం తప్పుతుందా?" అన్నాడు పగటిచుక్క.

"ఎందుకు తప్పదూ ? జీవితమంతా వృధా ఐనా ఈ ఆఖరిక్షణాలలో నువ్వొక ఘనకార్యం చెయ్యకూడదని ఎక్కడ ఉంది?" అన్నాడు అధికారి.

"దేవుడెలాగ ఉంటాడో ఊహించుకోగలిగితే తప్ప ధ్యానం చెయ్యడం కష్టంకదా" అన్నాడు పగటిచుక్క. "దేవుడు దయామయుడని చెప్పేను. దేవుని స్వరూపం ఊహించుకోలేకపోతే నిన్ను దయతో చూచిన ఎవరో ఒకరి స్వరూపాన్ని మనస్సులో తలచుకొని అదే దేవుని స్వరూపమనుకుని ప్రార్థనచెయ్యి" అని చెప్పి అధికారి వెళ్లిపోయాడు. 'పగటిచుక్క' "నన్నెవరు దయతో చూశారు?" అని ఆలోచించడం ప్రారంభించాడు. తల్లి దండ్రులు తమపిల్లల్ని దయతో చూస్తారు. తన తండ్రి తనకు జ్ఞాపకం రాకపూర్వమే చనిపోయాడు తల్లికూడా తనకి పదేళ్లప్పుడే చనిపోయింది. కాని ఆమె పగటిచుక్కకు బాగా జ్ఞాపకం ఉంది. మా అమ్మ నన్ను ప్రేమతోనూ దయతోనూ చూసేది. ఆమె నా చిన్నతనంలో చనిపోకుండా ఇంకా కొంతకాలం బ్రతికివుంటే నాజీవితం బందిపోటు దొంగతనాలలోగాక మరొక మార్గంలో వెళ్లివుండేదేమో, అనుకున్నాడు పగటిచుక్క.

వాడు తల్లినిగూర్చి ఆలోచించుకుంటూంటే చిన్ననాటి సంగతి ఒకటి జ్ఞాపకం వచ్చింది. ఒకనాడు వాడు పక్కింటికుర్రవాడూ తమ తమ మట్టి ఏనుగులను తెచ్చుకుని ఆడుకుంటున్నారు. ఆటలో పక్కింటి

కుర్రవాడి కాలిక్రిందపడి తన ఏనుగుతొండం విరిగిపోయింది. తను కోపంతో ప్రక్కింటి కుర్రవాని బొమ్మను తీసి దాని తొండాన్ని కూడా విరిచెయ్యపోయాడు. అప్పుడు లోపలనుండి తల్లివచ్చి, "వాడి బొమ్మ విరిచేస్తే, నీ బొమ్మ బాగుపడుతుందిట్రా నాయనా? వాడి బొమ్మను వాడికిచ్చెయ్యి" అని ఇప్పించేసింది.

ఆ చిన్ననాటి సంగతిని ఆలోచించుకుంటూన్న 'పగటిచుక్కకు' 'అన్నా' అన్న పిలుపు వినబడింది. "ఎవరు?" అన్నాడు పగటిచుక్క. అతనిముందు ఒక స్త్రీ నిలబడి, "అన్నా, పతిభిక్ష వేడటానికి వచ్చాను. నా భర్త ప్రాణాలు నీ చేతులలో ఉన్నాయి" అంది. "న్యాయాధికారి కోడలవా నువ్వు? "అన్నాడు పగటిచుక్క. "ఔను. నా మామగారు తన ధర్మాన్ని నెరవేర్చుకున్నారు. నిన్ను విడిపించడం ఆయన చేతులలో లేదు. నా భర్తను చంపడంవల్ల నీకేమిలాభం?" అన్నదామె.

పగటిచుక్కకు ఆ క్షణంలో తల్లి చిన్ననాడు చెప్పిన మాటలు జ్ఞప్తికివచ్చాయి మళ్లీ. "వాడి బొమ్మని విరిచేస్తే నీ బొమ్మ బాగుపడు తుందట్రా నాయనా? వాడి బొమ్మను వాడి కిచ్చెయ్యి?"- అది, ఆనాడు అమ్మ చెప్పిన మాట.

"నిజమే న్యాయాధికారికుమారుని ప్రాణాలు తీయిస్తే నా ప్రాణాలు నిలబడతాయా? ఆ నిరపరాధిని చంపించడం అర్థంలేని పని. నా జీవితం వృధాయేఐనా ఈ ఆఖరిక్షణంలో ఈ ఘనకార్యం చేస్తాను," అన్న నిశ్చయానికివచ్చి పగటిచుక్క న్యాయాధికారి కోడలితో "చెల్లెలా, వెళ్లు. నీ భర్త సురక్షితంగా ఇంటికి చేరుకుంటాడు" అని చెప్పి పంపే శాడు. ఆమె వెళ్లిన తరువాత 'పగటిచుక్క' తన అనుచరులకు కడసారి ఆజ్ఞను పంపేడు: "న్యాయాధిపతి కుమారుణ్ణి వదిలెయ్యండి. మీరందరూ ఇంక బందిపోటు దొంగతనాలు మానేసి మీ భుజబలాన్ని దేశసేవలో వినియోగించండి."

ఈ విధంగా 'పగటిచుక్క' తన ఆఖరిక్షణాలలో ఒక ప్రాణం నిలబెట్టడమే కాకుండా తన ఐదువందలమంది అనుచరుల జీవితాలనూ బాగుపరచగలిగేడు.




ఒక ఊళ్ళో ఒక ముసలమ్మ ఉండేది. పాపం ఆ ముసలమ్మకు కొడుకులూ, కూతుళ్ళూ, బంధువులూ ఎవ్వరూ లేరు. ఎప్పుడూ ఒక రాట్నం పట్టుకొని దారంతీస్తూ ఉండేది. ఇలా ఉండగా ఒకనాటి రాత్రి ఆ అవ్వ నిద్రబోతూవుంటే, దొంగలు కన్నం తవ్వేరు. ఇంక లోపలికి వస్తారు అనగా, అవ్వకి తెలివొచ్చి, లేచి కూర్చుంది కూర్చుంటే కన్నంలో దొంగలు కనపడ్డారు. అప్పుడు, తన యింట్లో ఎవరూ సాయంలేని మూలాన ఒక ఉపాయం పన్నింది దారంతీస్తూ, కొడుకులు లేకపోయినా పిల్లలున్నట్లు నటిస్తూ మళ్ళీ వాళ్ళు సమాధానం చెబుతున్నట్లు తన గొంతు మార్చుకుంటూ,

ముద్దుల మువ్వనా! లేరా నా కొడకా!
ఊఁ! ఆ! లేచానోయమ్మా!—
గంటల కావన్నా! లేరా నా కొడకా!
ఊఁ! ఆ! లేచానోయమ్మా!—
పచ్చని బసవన్నా! లేరా నా కొడకా!
ఊఁ! ఆ! లేచానోయమ్మా!—
వెంకటగిరి రామా! లేరా నా కొడకా!
ఊఁ! ఆ! లేచానోయమ్మా!—

అని పాడింది.

అప్పుడేమైందంటే, "అయ్యో! అవ్వకి నలుగురు కొడుకుల్లాఉంది. వాళ్ళు లేచారంటే మనం దొరికిపోతాము" అని భయపడి కన్నములోని దొంగలు పారిపోయారు. తన యుక్తి బాగా పారినందుకు ముసలమ్మ చాలా సంతోషించింది.



# రావణునికి శుభలేఖ



టేకుమళ్ళ కామేశ్వరరావు

జనక మహారాజు సీతయొక్క స్వయంవరాన్ని గురించి ఆహ్వాన లేఖ దేశాలన్నిటినీ పరిపాలించు రాజులకు — ఒక్క రావణాసురుడికి తప్ప అందరికీపంపించాడు. అన్ని దేశాల రాజులు సీతా స్వయంవరానికి విచ్చేశారు.వారు శివధనుస్సును ఎత్తడానికి ప్రయత్నిస్తున్నారు.

అదే సమయంలో రావణాసురుడు విమానంమీద మిథిలా పట్టణం మీంచి వెళుతున్నాడు. పట్టణ వైభవంచూచి రావణుడు "ఏమిటి ఇక్కడ విశేషం! ప్రజలంతా ఇంత ఉత్సాహంగా ఉన్నారే?" అని ఆశ్చర్యపోయి కిందికి వచ్చాడు. సీతా స్వయంవరం అని తెలుసుకున్నాడు. జనకుడు తనకు ఆహ్వానలేఖ ఎందుకు పంపలేదు అని మండిపడ్డాడు. జనక మహారాజు దగ్గరకు వెళ్ళాడు. అతన్ని చూచి జనకుడు వెలవెలపోయి, చతికిల పడ్డాడు. ధైర్యం తెచ్చుకొని లేచి నిలబడి, రావణాసురుడికి నమస్కారము చేశాడు.

రావణాసురుడు నిప్పులు కక్కుతూ "నాకెందుకు ఆహ్వానపత్రిక పంపలేదో సంజాయిషీ చెప్పు" అన్నాడు.

జనక మహారాజు తడబడుతూ "దేవరవారికి పంపవలసిందని మంత్రిగారికి యిచ్చేనండి"అన్నాడు అప్పటికి గండం గడిచింది.

రావణుడు మంత్రిని పిలిపించి "మంత్రీ, నాకు లేఖ ఎందుకు అందలేదు?" అన్నాడు. మంత్రి "నేను కిల్లేదారు కిచ్చేనండి" అన్నాడు.

రావణుడు కిల్లేదారుని పిలిపించి "ఏమయ్యా! నాకెందుకు లేఖ పంపలేదు" అన్నాడు. "మహాప్రభూ! నేను నా కింద ఉద్యోగస్తుడి కిచ్చేనండి, తమకు తప్పక పంపవలసిందని" అన్నాడు.

రావణుడు ఆ ఉద్యోగస్తుణ్ణి పిలిపించి అడిగేడు. ఆ ఉద్యోగస్తుడు మరొకడిమీద నింద మోపాడు. ఇట్లు పోగాపోగా ఆఖరికి ఒక గుమాస్తా మిగిలేడు. అతన్ని రావణుడు పిలిపించి "లేఖ నాకెందుకు పంపలేదు" అని అడిగేడు. అతను "మహాప్రభూ! క్షమించవలసింది. అది నా అజ్ఞానము కాదు. అదిగో చూడండి! పదిహేను బళ్ళమీద నిఘంటువులు తీసుకు వచ్చేను. తమకు ఏఏ బిరుదులుంచి ఆ లేఖను పంపించాలో తెలియక ఇప్పటివరకు గ్రంథాలను తిరగవేస్తూనే ఉన్నాను" అని ఆబళ్ళ గ్రంథాలన్నీ చూపించాడు.

రావణాసురుడు ఎంతో సంతోషించేడు.

"గుమాస్తా యుక్తిచేత మనమందరం బ్రతికేము కదా!" అని రాజు దగ్గరనుంచి నౌకరుదాకా అంతా సంతోషించేరు.





# ఈశ్వరచంద్రుడు నవయువకుడు

జంధ్యాల పాపయ్యశాస్త్రి

పగలు పదకొండు గంటలు కావచ్చుచుండెను. అప్పుడే బర్ద్వాన్ స్టేషనులో రైలుబండి ఆగినది. రెండవ తరగతి పెట్టెలోనుండి ఒక నవ యువకుడు క్రిందికి దిగెను. అతనివెంట ఒక పెట్టెయు, పేము సంచియు ఉండెను. నవయువకుడు ఇటునటు చూసి "కూలీ, కూలీ" అని అరచెను. ప్లాటుఫారముపై కూలీ ఎవ్వడును కనిపించలేదు. యువకుడు చప్పట్లు కొట్టుచు "కూలీ, కూలీ" అని మరల పెద్దగా అరచెను. కాని అచ్చట వానికి కూలీవాని జాడ కానరాలేదు.

మిట్ట మధ్యాహ్నము. ఎండ మిటమిట లాడుచుంచెను. ఇంతలో ఒక వృద్ధుడచ్చటికి వచ్చి "అయ్యా! ఇచ్చట కూలీలెవ్వరూ లేరు. మీ కభ్యంతరము లేనిచో మీ పెట్టెయు, సంచియు నేను మోసికొని వచ్చెదను" అని పలికెను. నవయువకుడందులకు అంగీకరించెను. వృద్ధుడు సామాను రెండు చేతులతో పట్టుకొని యువకునివెంట నడిచెను.

ఉభయులును నవయువకుని గృహామునకు చేరిరి. వృద్ధుడు సామాను ఇంటిలో పెట్టి "అయ్యా! నేను వెళ్ళివచ్చెదను" అని పలికెను. యువకుడు వృద్ధునకు కూలీ డబ్బులు ఈయబోయెను. కాని వృద్ధుడు పుచ్చుకొనుటకు [illegible]ంచెను. అతని అమాయకత్వమునకు యువకునకు చాలా ఆశ్చర్యము కలిగెను.

సాయంకాలము నగరమున పెద్ద సభ జరుగబోవుచుండెను. మహా సభలో పాల్గొనుటకై యువకుడు ఆ పట్టణమునకు వచ్చియుండెను. సరియగు సమయమునకు యువకుడు సభా భవనమునకు అరిగెను.

ఆనాటి సభకు అధ్యక్షుడు 'ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు'.

యువకుడు సభలోనికేగి అగ్ర పీఠముపై కూర్చుండియున్న ఈశ్వరచంద్రుని వదనముచూచి చకితుడయ్యెను. తన సామానును మోసికొని వచ్చిన వృద్ధుడే ఆ సభాధ్యక్షుడని యువకుడు గుర్తించెను.

సభ సమాప్తమైన అనంతరము యువకుడు ఈశ్వరచంద్రుని వద్దకు పోయి నమస్కరించి తన అవివేకమునకు క్షమింపుమని పరిపరి విధముల ప్రార్థించెను.





# కిం-కం-మాపెద్దకొప్ప నీరొమ్ముఘం

అంతటి నరసింహం

ఆవూళ్ళో చదువు వచ్చినవాడు చలమయ్యే ఒక్కడే! అతడు చాలా గొప్పగా చదువుకొన్నవాడని, ఆవూళ్లో ఎవరిని అడిగినా తడుముకోకుండా చెప్పేస్తారు. ఆ చెప్పడంకూడా మామూలుగా చెప్పినట్లుగా చెప్పరు. నిశ్చలంగా నిలబడి, ధ్యానమగ్నులై, కండ్లు మూసుకొని, చేతులు జోడించి, అర్ధనిమీలిత నేత్రాలతో "ఆయన మహానుభావుడు. గొప్ప చదువుకున్నోడు. ఆయనకు తెలీంది ఈ పెపంచకంలో నేమీ లేదు" అంటారు. ఈ ధోరణిచూస్తే మనంగూడా అక్కడకువెళ్లి ఒకసారి ఆ పండితుడి దర్శనం చేసికొని, జీవితాన్ని చరితార్థం చేసుకుందామా అనిపిస్తుంది.

ఆవూళ్లోకంతా చలమయ్య తలలోని నాలుకవంటివాడు-బుర్రలో మెదడువంటి వాడు, శరీరంలో గుండెకాయ లాంటివాడు. ఏ పనిఅయినా ఆయన సలహా తీసుకోనిదే ఎవరూ ఏమీ చేయరు. ఆయనకు ఆస్తిలేదు. అయితే మూడుపూటలా సుష్టుగా భోజనం చేస్తాడు. ఆవూళ్లో ఎవడైనా ఎప్పుడైనా పస్తులుంటాడేమోగాని, చలమయ్యగారికి అలాంటి బాధ ఏమీలేదు.

వాన కురుస్తూవుంటే రైతులు పొలాలకు పోరు. ఒకరోజున వాన ఏకధాటిగా కురుస్తున్నది. రైతులు మామూలుగా ఆయనదగ్గరకు వచ్చి "అయ్యా! పుస్తకం కాస్త చదవండి" అన్నారు. అంతే! దారాలు కట్టిన ముక్కద్దాలు ధరించి, నస్యం అరతులం ముక్కు రంధ్రాల్లోకి ఎక్కించి, చీది, దగ్గి, "అః! అలనాడు రాముడు ద్వైత వనంలో విహరిస్తూవుండగా అర్జునుడు ఎదురుపడి, ఓయీ! నీవెవండవు? ఇందేల వచ్చితివి, ఎందు పోయెదవు? నాతో యుద్ధంచేసి గెలిస్తేనే అవతలకు పోగలవు — అని ఎదిరించిన తరువాత; ఏమేం జరిగిందంటే" అని తరువాత రెండు పద్యాలు చదివి, "అట్లా ఎదిరించిన తరువాత రాముడు మందహాసంచేసి, ఒక బాణంతో గట్టిగా కొట్టగా అర్జునుడు మూర్ఛపడి లేచి, వీపు దులుపుకొంటూ "బావా! క్షమించు. నీవు నిరాటంకంగా ఇక వెళ్లిపోవచ్చును" అని వెళ్లిపోతూ వుండగా... వింటున్నారా" అంటూ రైతులవైపు చూచాడు. "అయితే, ర్జునుడి బావ కృష్ణుడన్నావు కదా మొన్న" అన్నాడు ఒక రైతు. "రాముడూ, కృష్ణుడూ ఒకటే గదటోయ్!" అన్నాడు చలమయ్య మందహాసంచేస్తూ. "ఆహా! ఆహా! ఎంత బాగా సెలవిచ్చారు స్వామీ" అని అందరూ తలలూపుతూ ఆనందించారు.

పెద్ద బాలశిక్ష పాండిత్యం చలమయ్యగారిలో బాగావుంది. ఏదైనా వేదాంత సంబంధమైన పదం వస్తే— "అండ పిండ బ్రహ్మాండ పిపీలికాది బ్రహ్మపర్యంతం" అనేవాడు. ఏదైనా లోకం పేరుతగిలితే, "అతల, వితల, సుతల, రసాతల, మహాతల, పాతాళ" అనేస్తాడు. "భూలోక, భువర్లోక, స్వర్లోక, మహాలోక, జనలోక, తపోలోక, సత్యలోకాలు" అంటాడు. సముద్రం అనే పదం తగిలితే లవణ ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, శుద్ధోదక' అంటాడు. దేశం పేరువస్తే 'అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కుకుర, బర్బర, కర్నాటక, ద్రావిడ' అనేస్తాడు, ఏదైనా సొత్తు విషయంవస్తే 'గొలుసులు, కడియాలు, ఒడ్డాణాలు, ఉంగరాలు, నాసులు, కంటెలు, తలబిళ్లలు, మొలబిళ్లలు' అని జాబితా ఏకరువు పెడతాడు. ఏ విషయం చెప్పేటప్పుడైనా మామూలుగా చెప్పడు. హావభావాలు, ఆంగిక సంచలనాలు అతిగా ప్రదర్శిస్తాడు. ఉద్రేకంతో ఊగిపోతాడు. ఇదంతా చూచి రైతులు అద్భుతపడతారు.

ఇట్లా జరుగుతూవుండగా, వానకు తడుస్తూ ఒక బాటసారి తటాలున అక్కడికి చక్కా వచ్చాడు. అతడు కాస్త డొక్కశుద్ధి గలవాడు. చలమయ్యగారి పురాణం చెప్పే ధోరణి విని ఆశ్చర్యపోయాడు. అర్థం కానివాడు తన దారిన తాను పోతే బాగుండేది. కాస్త దగ్గరగావచ్చి, "కిం పండితాణాం?" అన్నాడు. అంటే, పండితులవారు సెలవిస్తున్న దేమిటి? అని అర్థం. కాని చలమయ్యగారికి అది అర్థం కాలేదు. ఎంతో ఆలోచించాడు. అండ పిండ బ్రహ్మాండమంతా వెదికాడు. అతల, వితల, సుతల, మహాతల, రసాతల, పాతాళాలు వెదికాడు. ఏడేడు పధ్నాలుగు లోకాలూ వెదికాడు. లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీరోదక సముద్రాలు గాలించాడు. ఎక్కడా ఆ పదానికి అర్థం దొరకలేదు. ఇట్లా రైతులవైపు చూచాడు. వాళ్ళంతా ఉత్సాహంతో, ఉత్సుకతతో 'చలమయ్యగారు ఏమి చెబుతాడా!'అని ఎగజూస్తున్నారు. ఈనాడు తాను ఓడితే, ఇక ఈ రైతులదగ్గర తాను బ్రతకలేననుకొన్నాడు. ఆ వచ్చిన పండితుణ్ణి కాస్త పట్టిచూడాలనుకొన్నాడు. ఒకసారి దండిగా నస్యం పీల్చి, లేచి, ముందుకువంగి, ఆ పండితుడి మొలకట్టులో చేయివేసి "కిం"అని వెనక్కి తోసి, "కం"అని ముందుకు లాగి, "మాపసెద్దుకొమ్ము నీ రొమ్ము ధం" అని పిడికిలితో గట్టిగా పొడిచాడు. ఆ దెబ్బతో ఆ పండితుడు సొమ్మసిల్లి క్రింద పడిపోయాడు. అదిచూచి, ఆ జనమంతా "వహావ్వా చలమయ్యగోరూ!"అంటూ చప్పట్లుచరుస్తూ ఎగిరారు. ఎంత గొప్పవాడు మా చలమయ్యగోరు అంటూ ఉబ్బిపోయారు.

ఒక నిముషంలో తెలివి వచ్చింది క్రింద పడిపోయిన ఆ కొత్త పండితునికి. పడుకొని వుండగానే ఆలోచించాడు— చివాలున లేచి, చలమయ్య పాదధూళి కొంచెం తీసుకొని, కండ్లకద్దుకొని, నొసటబొట్టు పెట్టుకొని, ఆయన కాలి రోమం ఒకటి పీకి, లేచి, ముకుళితహస్తుడై, ప్రార్థనాక్రమంలో కళ్లుమూసుకొని, కాస్సేపు ధ్యానించి, ఆ వెంట్రుక ముక్కను మళ్లా కళ్లకద్దుకొని, తన జుట్టులో నొక్కుకుని, అదంతా చోద్యంగా చూస్తున్నవారి నుద్దేశించి— "ఈ చలమయ్యగారు సాక్షాత్ భగవంతుడు. ఆయన పాదసేవవల్ల నేను తరించాను. నిరంతర సేవాభాగ్యంవల్ల మీరు దేవతలే అయిపోయారు. ఆయనది ఒక వెంట్రుక మన దగ్గర వుంటే, సకల శాస్త్రజ్ఞానమూ మనకు వశమవుతుంది. అందుకే

ఆయన వెంట్రుకను నేను శిరస్సున ధరిస్తున్నాను." అంటూ బిరబిరా వెళ్లి పోయాడు,

ఆయన అటుతిరిగి ఒక అడుగువేశాడో, లేదో అచటి వారందరూ ముందుకు జరిగి, చలమయ్యగారి మీద పడి, కనిపించిన రోమాలూ, వెంట్రుకలు పీకడం మొదలుపెట్టారు. "అబ్బా! చురుకురోయ్! చచ్చా న్రోయ్" అని అతడు మొత్తుకున్నా వదలలేదు. "వుండండి స్వామీ! ఇంత గొప్పవారుగా వుండికూడా నొప్పి అంటారేమిటి?" అంటూ ఎన్ని వెంట్రుకలు దొరికితే, అంత గొప్ప అన్నట్లుగా జుట్టుతోపాటు, సకల రోమాలూ లాగిపారేశారు. చలమయ్య సొమ్మసిల్లి నిశ్చేష్టుడుగా పడి పోయాడు. అదిగూడా గమనించకుండా ఆయన గొప్పదనాన్ని గురించి పొగుడుకుంటూ తలాకొన్ని వెంట్రుకలు, తమ సిగల్లో దోపుకొంటూ వెళ్లిపోయారు — జ్ఞానులమయ్యామని అనుకొంటూ —






రామాపురం అనే పట్నంలో ధర్మయ్య అనే ఒక ధనికుడు ఉండేవాడు. ధనవంతుడైనా పేదవారంటే ఆయనకు జాలి. కష్టాల్లో ఉన్నవారికి ఏదో సహాయం చేయడం ఆయన స్వభావం.

ఓమారు దేశంలో కరువు వచ్చింది. వర్షాలు లేవు. పంటలు పండలేదు. ప్రజలంతా తిండికి కటకటలాడేరు. ఎందరో ఆకలికి అలమటించి దేశం విడిచి వెళ్ళిపోయారు.

ధర్మయ్య కలిగినవాడు. గత ఏడాది అతని ఇంట ధాన్యం, గోధుమలు నిలువచేసి ఉన్నాయి. కరువు చూసి, ధర్మయ్య కంటతడి పెట్టేడు. పేదవారు మరీ నిరాధారులయ్యేరు. ఇంతో అంతో కలవారు దూర ప్రాంతాలనుండి ఎంత వెల యిచ్చి అయినా బియ్యమో, చోళ్ళో, గంటెలో, ఇంకేవో తెప్పించుకొని కాలక్షేపం చేశారు. కాని పేదవాళ్ల గతేమిటి ?

బీదవాళ్ళను ఆదుకోపోతే వాళ్లు దిక్కులేని పశుల్లా మాడి చావవలసిందే! ధర్మయ్య ప్రతీపూటా వందమంది పేదపిల్లలకు చెరో రొట్టె పంచిపెట్టే ఏర్పాటు చేశాడు.

ఆ పట్నంలో నరసమ్మ అనే పేదరాలుంది. ఆమె అమ్మాయి సత్యవాణి. సత్యవాణికి పదేళ్లలోపు బుద్ధిమంతురాలు. తల్లి ధర్మయ్య పంచే రొట్టెల సంగతి అమ్మాయికి చెప్పింది. సత్యవాణి బయలుదేరింది.

ధర్మయ్య పనివాళ్ళు బుట్టతో రొట్టెలు తెచ్చేరు. పిల్లలంతా మూగిపోయేరు. ఆ బుట్టచుట్టూ తొక్కిడి అయ్యేరు. ఒకరిమీద ఇంకొకరు పడి ఆ రొట్టెలు తీసుకొన్నారు. చివరకు సత్యవాణికి ఒక చిన్న రొట్టె దొరికింది. ఆ రొట్టెను చేతో పట్టుకొని ధర్మయ్యకు నమస్కారం చేసి ఇంటికి చేరుకుంది. ఆ రొట్టె అమ్మకు యిచ్చింది. ఇద్దరూ ఆ రొట్టె తిన్నారు.

మర్నాడు అలాగే సత్యవాణి రొట్టెకోసం వెళ్లింది. అక్కడ చాలా మంది పిల్లలు చేరి ఒకరి నొకరు తోసుకుంటూ రొట్టెలకోసం గొడవచేస్తున్నారు. సత్యవాణి దూరంగా నిల్చుని అందరూ వెళ్లిన తర్వాత మిగిలి ఉన్న చిన్న రొట్టెనే తీసికొని, ధర్మయ్యకు వందనం చేసి యింటికి వచ్చింది.

ఇలా నాలుగు రోజులు జరిగింది. ధర్మయ్య సత్యవాణి వినయాన్ని, మంచితనాన్ని చూస్తూనే ఉన్నాడు!

అయిదో రోజున సత్యవాణి రొట్టె తీసికొని యింటికి వెళ్లి తల్లికి యిచ్చింది. నరసమ్మ రొట్టెను ముక్కలు చేసింది. రొట్టెలో నుండి టంగు టంగుమంటూ అయిదు రూపాయిలు పడ్డాయి. తల్లీ కూతురు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. వాళ్లకు ఎంతో ఆశ్చర్యమయింది. ఏదో పొరపాటు జరిగివుంటుంది. ధర్మయ్య బాబుగారి పనివాళ్ల పొరపాటు వలన రొట్టెలో రూపాయలు ఉండిపోయాయి. వెంటనే వెళ్ళి డబ్బు యిచ్చి రామ్మా!" అని పంపించింది నరసమ్మ.

పొద్దు పోయే వేళ! సత్యవాణి గబగబా నడిచి ధర్మయ్య యిల్లు చేరుకుంది. నమస్కారం చేసి అయిదు రూపాయలు ఆయన ముందు పెట్టి సంగతి చెప్పింది.

ధర్మయ్య చిరునవ్వుతో నవ్వి సత్యవాణిని చూసి ఇలాఅన్నాడు! "అమ్మాయి! నువ్వు ఎంతో మంచిదానివి. నీవలె మీ అమ్మ కూడా మంచితల్లి. నీ మంచి నడవడి నాకెంతో సంతోషమిచ్చింది. ఈ ఐదు రూపాయలు పొరపాటున రొట్టిలో ఉండలేదు. నేనే నీ రొట్టెలో ఆ డబ్బు పెట్టించేను. నీ మంచి నడవడికి బహుమతి అది. అంతే కాదు ఇదిగో మరో ఐదు రూపాయలు తీసుకు వెళ్లి మీ అమ్మగారికి యియ్యి. అని మరో ఐదు రూపాయలు కలిసి సత్యవాణి చేతులో ఉంచేడు ధర్మయ్య!. ఆ పిల్ల మరీ వింతగా నోట మాటరాక ఆయన్ని చూస్తూ నిల్చుంది. ధర్మయ్య మళ్లీ ఇలా అన్నాడు:

"నీ వంటి నిజాయితీ కలవాళ్లూ, క్రమశిక్షణ కలవాళ్లే దేశానికి పేరు తీసుకువస్తారు. ఈ దేశం బాగుపడాలంటే నీవంటి నీతి, వినయమూ కల పిల్లలు ముఖ్యం. "నీకీ డబ్బు బహుమానం. రేపటినుండి నీవు నా దగ్గరకే వచ్చి ఒక పెద్ద రొట్టె తీసుకువెళ్లు. భయపడకు"

సంతోషంతో సత్యవాణి ధర్మయ్యకు నమస్కరించి యింటికి వెళ్లింది. అమ్మతో బహుమతి సంగతి అంతా చెప్పింది.

అమ్మ కుమార్తెను ముద్దుపెట్టుకొని మురిసిపోయింది.

వినయ సౌశీల్యాలు తనరారు జనులు
బహుమతులేనైన బడయంగ వచ్చు!






# జేబుదొంగ

మద్దిపట్ల
వెంకటరావు

రాజు వివేకవర్ధనీ పాఠశాలలో ఎనిమిదో తరగతి చదువుతున్నాడు. రోజూ స్కూలుకు బస్సెక్కి కోటీలో దిగి వెళ్లేవాడు. ఆ రోజు బస్సెక్కుతూంటే తన ముందున్న మీసాలాయన ఆయనకు ముందున్నాయన జేబులోంచి పర్సు తీస్తుంటే చూశాడు. రాజు "దొంగ! ...... దొంగ!" అని అరుద్దామనుకున్నాడు. కాని ధైర్యం చాలలేదు. సర్లే చూద్దాం! అనుకుంటూ బస్సెక్కి ఆ పర్సుదొంగ ప్రక్కనే కూర్చున్నాడు.

ఈలోగా కండక్టరు 'టికెట్ టికెట్' అంటూ రాజు ప్రక్కాయన్ని అడుగుతే ఆయన కొన్ని పైసలు కండక్టరుకు యిచ్చాడు. కండక్టరు టికెట్ యివ్వలేదు. కండక్టరు రాజును కూడా టికెట్ అడిగేడు. రాజు పైసలిచ్చేడు. కండక్టరు టిక్కెట్ యివ్వకుండా వెళ్లిపోతుంటే "ఏయ్ కండక్టర్, పైసలిచ్చాగా టికెట్ ఇయ్యి" అంటూ అడిగేడు. కాని కండక్టర్ కుర్రాడేకదా అని వెళ్ళిపోతూంటే రాజు ఊరుకోలేదు. "ఇదిగో కండక్టర్ ...అదిగో అక్కడేం వ్రాసి ఉంది?... డబ్బులిచ్చిన తర్వాత టికెట్ అడగమని. లేకపోతే నూరు రూపాయలు జరిమాన అని లేదూ. కాబట్టి టికెట్ ఇయ్యి. లేకపోతే నేను దిగిపోతాను" అంటూ గట్టిగా అరిచాడు.

బస్సులో జనం అంతా రాజు ప్రవర్తనకు ఆశ్చర్యపోయారు. "చిన్నవాడివైనా మంచి తెలివైనవాడివయ్యా" అంటూ కొంతమంది, "భలే, టికెట్ కొనకుండా ఐదు, పది పైసలు కండక్టరుకు లంచమిచ్చి దిగిపోయేవాళ్లకి, ఈ దెబ్బతో బుద్ధిరావాలి" అని మరికొందరు అన్నారు. ఈలోగా కోటీ వచ్చింది. అంతా దిగిపోతున్నారు.

రాజు మనసు అంతా యిందాకా పర్సు దొంగమీదే ఉంది. పర్సు దొంగ దిగి వెళ్ళిపోతూంటే రాజు అతన్ని వెంబడించాడు. పర్సు దొంగ కోటీ పోలీసు స్టేషనుకు ప్రక్కనున్న హోటలులోకి వెళ్ళి ఒక టేబుల్ ముందు కూర్చున్నాడు: రాజు అది చూసి గబగబా ప్రక్కనున్న పోలీసు స్టేషనులోకి వెళ్ళాడు. అక్కడ సబ్ఇనస్పెక్టర్ ఏదో వ్రాసుకుంటున్నాడు.

రాజు "సార్—సార్" అన్నాడు.

ఇనస్పెక్టర్ 'బాబూ! ఏమయింది?' అని అడిగాడు.

"సార్ మరేమో, నేను బస్సు ఎక్కుతూంటే నాకన్న ముందు ఎక్కుతున్నాయన మరొకరి జేబులోంచి పర్సు కాజేశాడండీ" అన్నాడు.

"అలాగా, మరి అతనేడి ? బస్సు వెళ్లిపోయిందిగా" అన్నాడు.

"బస్సు వెళ్ళిపోయిందండి. కాని నేను ఆ పర్సు దొంగని వెంబడిస్తూ వచ్చానండి. అదిగో ఆ దొంగ హోటల్లో ఉన్నాడు." అన్నాడు రాజు.

"అలాగా, అయితే నడు" అంటూ ఇనస్పెక్టరు రాజుతో కలసి హోటల్లోకి వెళ్ళి పర్సు దొంగని తీసుకొని స్టేషనులోకి వచ్చాడు.

"ఏయ్, ఏదీ ఆ పర్సు ? యిలా యియ్యి!" అంటూ ఇనస్పెక్టరు గట్టిగా అడిగాడు.

"అబ్బే! నాకేం తెలియదు" అన్నాడు పర్సుదొంగ.

"అదిగో, బొడ్డులో పెట్టాడు ఇనస్పెక్టరుగారూ!" అంటూ రాజు చెప్పాడు.

ఈలోగా ఒక కానిస్టేబుల్ వచ్చి పర్సు దొంగ కడుపులో ఒక గుద్దు గుద్దేసరికి పర్సు కాస్తా క్రింద పడింది, "ఏయ్! కానిస్టేబుల్, ఈ దొంగని లాకప్‌లో పెట్టండి" అనేసరికి అతనిని లోపలికి లాక్కువెళ్ళి పోయారు.

ఇనస్పెక్టర్ రాజుని "చూడు బాబూ! ఇవాళ నీవు ఎంతో మంచిపని చేశావు. పాపం! ఎవరిదో ఆ పర్సు! రెండువేల రూపాయలున్నాయి!" అన్నాడు. రాజు బిక్కమొహం వేశాడు. "అదేమిటోయ్, అలా బిక్కమొహం వేశావ్ ? అని ఇనస్పెక్టర్ అడిగేసరికి "సార్ స్కూలుకు లేటయిందిసార్ ... లేటుగా వెడితే మాస్టారు కొడతారుసార్!" అన్నాడు. "అలాగా సరే! నడు, యిక్కడేగా మీ స్కూలు. నే వచ్చి దిగబెడతాను!" అంటూ ఇనస్పెక్టర్ రాజుని స్కూల్లో దిగబెట్టి హెడ్‌మాస్టార్‌కి అంతా చెప్పాడు.

హెడ్మాస్టారు రాజుని ఎంతో మెచ్చుకున్నాడు. తర్వాత స్వాతంత్ర్యదినంనాడు రాజు సాహసానికి మెచ్చుకుంటూ ప్రభుత్వం అతనికి మంచి బహుమతి కూడా యిచ్చింది.



# తెడ్డు రహస్యం

అంట్యాకుల పైడిరాజు



మన తెలుగునాట ప్రతి ఏట ఎన్నో పండుగలు జరుగుతాయి. అన్ని పండుగలలాగే అమ్మవారి పండుగ ఒకటి. ఈ పండుగ పల్లెలలోనూ, పట్టణాలలోనూ అక్కడక్కడ జరుగుతూ ఉంటుంది. ఈ పండుగ రాత్రి తెల్లవార్లూ జరుగుతుంది. ప్రజలు చుట్టూ ఉన్న పల్లెల నుంచి పండుగ జరిగే చోటికి హాజరవుతారు... ఇలాంటి పండుగలు పిల్లలకు ఉత్సాహంగా ఉంటాయి. రాత్రి తెల్లవార్లూ రకరకాల విద్యా ప్రదర్శనలు జరుగుతాయి... దానిలో చూడముచ్చటయినవి, బండి పందాలు, పులివేషాలు, ఇంకా ఇతర ఆట పాటలూను. డప్పుల దరువులు ప్రతి చోటా చెవులు గింగురులెత్తేటట్లు ఉంటాయి.

ఈ సంబరాలలో చాలామంది "గారడివిద్య" ప్రదర్శిస్తారు. గారడీ విద్య అనగానే కత్తిసాము, కర్రసాము జ్ఞాపకం రాక తప్పదు. సాము చేయటానికి వాడబడేవన్నీ దెబ్బలాట్లకు సంబంధించినవే! కర్ర, కత్తి, ఈటె, గద, ఇలాంటివి దానిలో వాడతారు. గారడీ సాము లయబద్ధంగా చక్కగా చేస్తారు.

ఇలాంటి పరికరాలతో సాముచేసి విద్య ప్రదర్శిస్తూ ఎదుటి పోటీదారుణ్ణి ఓడించటమే ఈ పోటీయొక్క ఉద్దేశ్యం. కాని ఒకరిపై ఒకరు ద్వేషభావాలు తీర్చుకోటానికి ఉపయోగించరు.

గారడీ విద్యలో పేరు గడించినవారు అక్కడక్కడా ఉంటారు. అనేక పోటీలలో పాల్గొని పేరు ప్రఖ్యాతులు గడించిన వారిలో భీమన్న ఒకడు. అనేకచోట్ల ప్రదర్శనాలిచ్చి బహుమానాలు, బిరుదులు పొందాడు భీమన్న. భీమన్న గొప్ప బలాఢ్యుడు.

కుస్తీలో, పులివేషములో, రాళ్ళను ఎత్తడంలో గొప్ప మొనగాడు విజయనగరం కోడి రామమూర్తిలా ఛాతీమీద పెద్ద బండను ఎక్కించి రాతిపై సుత్తితో కొట్టించుకోవటం అతని ప్రత్యేకత.

భీమన్న గురువు రామన్న బాగా వయసు మళ్ళినవాడు. భీమన్నకు అన్ని విద్యలు నేర్పాడు. కాని కొన్ని రహస్యాలు మాత్రం దాచుకున్నాడు. భీమన్నను అందరూ గురువును మించిన శిష్యుడని పొగడటం రామన్నకు ఇష్టంలేదు. అందుకని చాలా మందితో "వాడిమొఖం, వాడికేం తెలియదు పొమ్మ"నే వాడు.

వారిద్దరిమధ్య వైరం చూడాలనేవారు కొందరు. భీమన్నకు రామన్న మాటలు చేరవేశారు. భీమన్న గురువుమీద కారాలు, మిరియాలు నూరాడు. ఇద్దరిమధ్య ద్వేషభావం అగ్గిమీద గుగ్గిలంలా మండుకుంటూ వచ్చింది.

కొన్నాళ్ళకు గ్రామదేవత పండుగ రానేవచ్చింది. సమయం వచ్చింది గదా అని పుర ప్రముఖులు గురుశిష్యుల మధ్య పోటీ ప్రదర్శన ఏర్పాటు చేశారు. తనతో పోటీకి గురువు ఒప్పుకున్నందుకు, భీమన్నకు పరమానందమయ్యింది. ఈ దెబ్బతో గురువుకు బుద్ధి చెప్పవచ్చునని అనుకొన్నాడు భీమన్న.

సమయం రానేవచ్చింది. జనమంతా గారడీ విద్య ప్రదర్శించే చోటికి కోలాహలంగా చేరుకొన్నారు. ప్రదర్శన ప్రారంభమయ్యింది.

గురువు ఒక ప్రక్కనుంచి, శిష్యుడు ఇంకొక ప్రక్కనుంచి కర్రతో సాము చేసుకుంటూ నిర్ణయించిన గిరిచుట్టూ తిరుగుతున్నారు. ఒకరు వేసిన పేచీకి మరొకరు నేర్పుగా జవాబు చెప్పుకుంటున్నారు, కాళ్ళతో లయలు వేసుకుంటూ ముందుకు, వెనక్కు అడుగులువేసి కర్రలు గిర్రున

త్రిప్పడం చూస్తున్న ప్రేక్షకులకు ఎంతో ఉత్సాహం, ఉద్రేకం కలిగిస్తున్నది. పిన్నలు, పెద్దలు కళ్ళప్పగించి చూస్తున్నారు.

ఒక పరికరం తరువాత మరో పరికరం మార్చుకుంటూ దేనికి తగ్గట్లు దాని పద్ధతులతో లయబద్ధంగా సాముచేస్తున్నారు. నువ్వా! నేనా! అన్నంత హోరాహోరీగా యుద్ధం చేస్తున్నారు. ఉద్రేకపూరితమైన పౌరుషం బయలుదేరింది. ఎవరు 'ఓడిపోతారో' అనే అనుమానం ప్రేక్షకులలో కలుగకపోలేదు. ఒకరిమీద ఒకరు పౌరుషంగా మాటలు విసురుకొంటున్నారు. కథంతా మంచిపట్టులోకి దిగింది.

గురుశిష్యుల మధ్య ఎవరి చేతిలోని ఆయుధమూ క్రిందకు జారిపడలేదు. ఒకరిపట్టు ఒకరికి తెలుసు కనుక ఇద్దరిలో ఎవరూ తీసిపోలేదు.

గురువు బలహీనతను కనిపెట్టి ఒక దెబ్బతో ఓడించగలననుకొన్నాడు భీమన్న. ఆ ఊహలన్నీ తారుమారైపోయినాయి. ఇక ఆఖరు ఘట్టానికి వచ్చింది కథ. గురు విచ్చిన సమస్య శిష్యుడు తీర్చాలి. అంత వరకూ రహస్యంగా దాచి ఉంచిన రెండు తెడ్లు బయటకు తీశాడు గురువు రామన్న.

రెండు తెడ్లతో అతిచమత్కారంగా సాము చేసుకుంటూ గిరిలోకి దిగాడు రామన్న. భీమన్నకు కూడా ఒక తెడ్డు అందించాడు. భీమన్నకు దానితో ఏమిచేయాలో తెలియలేదు. తికమకపడ్డాడు. "ఈ తెడ్డు రహస్యం" గురువుగారు ఎప్పుడూ చెప్పలేదే! "ఈయన ఒట్టి కపటి" అని లోలోపల గొణుక్కున్నాడు.

ఐనా ఏమిలాభం! ఎంతో బలాఢ్యుడు పిరికివాడయిపోయాడు భీమన్న.

చేసేదిలేక గురువుమీద కోపోద్రిక్తుడై గిరిలోకి పరుగెత్తుకొని వెళ్ళి గురువును నిలవేసి అడిగాడు. ఎందుకింత చిన్నబుద్ధి చూపావని గురువు మీద కలియబడ్డాడు కూడా. సభ అంతా అల్లకల్లోలమై పోయింది.

"తెడ్డుని ఎవరైనా సాముకి తెస్తారా?" అని అడిగాడు భీమన్న.

"తెడ్డులో వున్నది కర్రేనోయ్! సమయాన్నిబట్టి అవసరమైనప్పుడు అందుకు అనుకూలమైనది ఏ వస్తువైనా వాడవచ్చునోయ్" అని బిగ్గరగా చెప్పాడు రామన్న.

గురుశిష్యుల వాదం ప్రేక్షకులకు ఆశ్చర్యాన్ని కలిగించింది. కల్లోలమంతా ఒక్కసారి నిశ్శబ్దమైపోయింది. గురువు చెప్పే తీర్పుకోసం ఎదురుచూస్తున్నారు ప్రజలు.

భీమన్నకు ఇంకా ఇలా బుద్ధి చెప్పడం మొదలు పెట్టాడు రామన్న.

"భీమన్నా! నీకు శరీరబలం ఉందికాని ఏంలాభం ... బుద్ధి బలం లేదు. అది నిరూపించటానికే తెడ్డుతో సాముచేసి చూపాను. నేర్చుకొన్న పరికరాలతో నేర్చుకొన్న విద్య యథాతథంగా అప్పజెప్పటం కాదోయ్ విద్యకు కావలసింది. ఎటువంటి కొత్త సమస్య వచ్చినా శాస్త్రబద్ధమైన మనోబలంతో పరిష్కరించగలగాలి. అప్పుడే విద్య రాణిస్తుంది. లేనప్పుడు నీకు వచ్చిన కీర్తి వ్యర్థమవుతుంది. కాస్త విద్యకువచ్చిన మెప్పుతో విర్రవీగటం మంచిదికాదు" అని భీమన్నకు గుణపాఠం నేర్పాడు గురువు రామన్న.

"గురువు గురువే! శిష్యుడు శిష్యుడే" అని ఇంటిదారి పట్టారు ప్రేక్షకులు.






పల్లవరం గ్రామంలో రామయ్య అనే ధనికుడు ఉండేవాడు. అతని తల్లి ప్రవర్తన వింతగా ఉండేది. ఆమెకు బిచ్చగాళ్లంటే అమిత అసహ్యం. కాని ఆమె ఇద్దరు కుర్ర బిచ్చగాళ్లకు రోజూ రెండు పూటలా తిండి పెడుతూండేది.

ఇది గమనించి తల్లి ప్రవర్తనకు కారణం అడిగాడు రామయ్య. ఆ కుర్రవాళ్ల తాతముత్తాతలు మంచి ధనికులనీ, రామయ్య తాత చేసిన దుర్మార్గంవల్ల వాళ్ల కుటుంబం పూర్తిగా చితికిపోయి, వాళ్లు దరిద్రులయారనీ రామయ్య తల్లి చెప్పింది.

ఇది విని రామయ్య గుండె ద్రవించింది. తమ కుటుంబంవల్ల ఆ కుర్రవాళ్లకు జరిగిన అన్యాయం తొలగిపోవాలనీ, అలా చేసే బాధ్యత తన మీద ఉన్నదనీ ఆయన అనుకున్నాడు.

వెంటనే రామయ్య ఆ కుర్రవాళ్ల తల్లిని చూడబోయాడు. ఆమె చాలా దీనస్థితిలో ఉన్నది. తన బిడ్డలు చాలా మంది వైద్య సహాయం లేక చనిపోయారని, ఈ ఇద్దరు కొడుకులు మాత్రమే బ్రతికి బట్టకట్టారని ఆమె చెప్పింది. ఆమె అడుక్కుని బతుకుతున్నది. రామయ్య ఆమెను అడుక్కోవడం మానమని చెప్పి, కొంతడబ్బు యిచ్చాడు. నెల

కావలసిన డబ్బు ఇస్తానని, ఆమె కొడుకులను చదివించి
ం చేస్తానని మాట యిచ్చాడు.

ళ్లలో పెద్ద వాడి వయస్సు తొమ్మిదేళ్లు. పేరు శంక
వాడు భీమయ్య. ఏడేళ్లు. రామయ్య చేస్తున్న ధనసహా
ళ్లో ఒక పాఠశాల నడుస్తున్నది. ఆ పాఠశాలలో పనిచేసే
కి రామయ్య కుర్రవాళ్లను అప్పగించి వాళ్లకు చదువు
.

వాళ్లకు చదువు మీద శ్రద్ధ లేదు. కొద్దిపాటి అక్షరజ్ఞానం
ళ్లకు ఏడాది పట్టింది. ఉపాధ్యాయుడు ఈ మాట చెబితే
ాపం, వాళ్లు పెరిగిన వాతావరణం అంత మంచిది కాదు.
విద్యార్థులతో కలిసి చదవనియ్యండి" అన్నాడు.

ళ్లు గడిచాయి. మిగతా విద్యార్థులు చదువు పూర్తి చేసి,
ద్యలు నేర్చుకోవడానికి వెళ్లిపోయారు. ఆ పాఠశాలలో
ముగిసింది.

రయ్య, భీమయ్య మరో అయిదేళ్లు చదివితేకాని వాళ్ళ
కాదు" అన్నాడు ఉపాధ్యాయుడు.

చేస్తే వాళ్ళకు ప్రోత్సాహంఉండదు. వాళ్ళు పైకిరాలేని
లో పెరిగారు" అన్నాడు రామయ్య.

అడిగితే శంకరయ్య తనకు వైద్యుడు కావాలని
ప్పాడు. రామయ్య వాణ్ణి ఒక పేరుమోసిన వైద్యుడి వద్దకు
వాడికి వైద్యశాస్త్రం నేర్పమన్నాడు.

ద్యుడు శంకరయ్యను పరీక్షించి "ఈ అబ్బాయికి మామూలు
బాగా చదుకోమనండి" అన్నాడు.

అనకండి. మీరు తలచుకుంటే వాణ్ణి వైద్యంలో ఉద్దం
రు. వీడికి వైద్యశాస్త్రం నేర్పితే మీకు మంచి బహుమానం
అన్నాడు రామయ్య.

వైద్యుడు బహుమానానికి ఆశపడి తన శిష్యులలో ఒకణ్ణి పంపేసి, వాడి స్థానంలో శంకరయ్యను తీసుకున్నాడు. అలా బయటకిపోయిన శిష్యుడు రామయ్యతో మొరపెట్టుకున్నాడు.

"నీకేం? సంస్కారమున్న ఇంటపుట్టావు. ఎలాగైనా బతకగలవు" అన్నాడు.

భీమయ్య ఇళ్లు కట్టించే పని నేర్చుకోవాలనుకున్నాడు. వాణ్ణి రామయ్య ఒక వాస్తు శాస్త్ర ప్రవీణుడి వద్దకు తీసుకుపోయి వాడికి ఆ శాస్త్రం నేర్పమన్నాడు. కాని ఆ ప్రవీణుడు భీమయ్యను పరీక్షించి, వాడికి ఉన్న చదువు చాలదన్నాడు.

"శ్రద్ధగా నేర్పితే ఎవడికైనా ఏ విద్య అయినా వస్తుంది. నేను డబ్బిస్తాను. వాడికి వాస్తుశాస్త్రం నేర్పండి. కాస్త నింపాదిగా నేర్చుకుంటాడు. అంతకన్నా ఏముంది?" అన్నాడు రామయ్య.

ఇద్దరూ పదేళ్ళపాటు తాము నేర్చుకొన్నదేదో నేర్చుకున్నారు. రాజుగారి దివాణంలో వాళ్లకు ఏవైనా ఉద్యోగాలు దొరుకుతాయేమో అని రామయ్య చూశాడు. కాని ప్రయోజనం లేకపోయింది. వైద్యంలోనూ, వాస్తులోనూ కూడా మెరికల్లాంటి యువకులపోటీ హెచ్చుగా ఉంది.

అది చూసి రామయ్య రాజుగారిని కలుసుకొని, తమ గ్రామానికి ప్రభుత్వ వైద్యుడూ, భవన నిర్మాతా అవసరంగా కావాలని, ఆ రెండు ఉద్యోగాలూ మంజూరు చెయ్యమని వేడుకున్నాడు. రాజుగారు సరేనన్నారు.

రామయ్య తన ఊరికి వచ్చి గ్రామాధిగారికి రాజుగారి ఫర్మానా చూపి, ఆ ఉద్యోగాలకు మనుషులు కావాలని చాటింపు వేయించుమన్నాడు.

చాటింపు విని వైద్యంలోనూ, వాస్తులోనూ మంచి నైపుణ్యం ఉన్నట్లు శిఫార్సులతో అనేకమంది వచ్చారు. వారితోపాటు, శంకరయ్యా, భీమయ్యా కూడా వచ్చారు.

నం ఈ పేదవాళ్ళకు ప్రోత్సాహం యివ్వడం అవసరం. అందు య్యను గ్రామ వైద్యుడుగానూ, భీమయ్యను భవన నిర్మాత రుమించుదాం" అన్నాడు రామయ్య గ్రామాధికారితో. ారి కాదనలేకపోయాడు.

ోనే శంకరయ్యా వైద్యం గ్రామస్తులకు ప్రమాదకరమని వారి ఫిర్యాదులు రామయ్యా పెడచెవిన పెట్టాడు. పోతే, యిళ్లు కట్టించే అవకాశం వెంటనే రాలేదు. అందుచే అతనిచేత తన దొడ్డిలోనే ఒక చిన్న డాబా ఇల్లు కట్టించాడు. భీమయ్యచేత అందరూ యిళ్ళు కట్టించుకుంటారని రామయ్యా

రోజు రామయ్యా ఆఖరి కొడుకు గోపాలుడు అనేవాడు కొత్త రుగుతూండగా ఒకభాగం కూలింది. కుర్రాడిమీద యిటుకలు వాడు పెద్దకేకపెట్టి పడిపోయాడు. కుర్రాణ్ణి వెంటనే శంక రికి తీసుకుపోయారు.

లుగురోజులు పాటు శంకరయ్యా చికిత్స చేసినా కుర్రాడు బాగు వాడే రామయ్యా దగ్గరికి వెళ్లి "బాబుగారూ, అబ్బాయిని ద్యుడికి చూపిస్తే బాగుంటుంది" అన్నాడు.

మయ్యా కంగారుగా తన కొడుకును నగరంలో శంకరయ్యా ్గకు తీసుకుపోయాడు. ఆయన వైద్యంతో గోపాలుడు కోలు

డుకును యింటికి తీసుకుపోతూ రామయ్యా వైద్యుడితో శంకరయ్యనూ వాడి తమ్ముణ్ణీ వృద్ధిలోకి తేవడానికి ఎంత ోత్సహించి చూశాను. నా ప్రయత్నం బూడిదలో పోసిన యింది. కారణం ఏమంటారు?" అన్నాడు.

ద్యుడు నవ్వి, "మీ ప్రోత్సాహమే వాళ్ళకు ప్రతిబంధక దాని మూలంగా వాళ్ళు తమ స్థాయిని పెంచుకునే ప్రయత్నం ్యలేదు. మీరు వాళ్ళకు ప్రోత్సాహం యియ్యదలిస్తే ఆర్థికంగా

సహాయం చెయ్యవచ్చు. మాటలతో ప్రోత్సాహం ఇవ్వవచ్చు. కాని వారి విషయంలో ప్రత్యేకతలు చూపకూడదు. అలా చూపడం వల్ల ప్రజలను అనర్హులుగా వదలడమేకాక కొందరి అర్హత గలవారిని నిరుత్సాహపరచడం కూడా జరిగింది." అన్నాడు.

రామయ్య తన తప్పు గ్రహించి, శంకరయ్యనూ, భీమయ్యనూ తిరిగి విద్యాభ్యాసంలో పెట్టాడు. మరో అయిదేళ్ళు శిక్షణ పొందినాక వాళ్లు తమ తమ విద్యలలో నిజంగానే ప్రవీణులయ్యారు.






"మామిడి తోపులో
మారుతయ్యున్నాడు
మారుతయ్యా బుద్ధి
మనిషి బుద్ధేనూ..."

బపాడుతుం. తాత, ఏ గోగునార తాడో అల్లుతూ ఉంటాడు.
కూర్చున్న కోతి, తాత పాటకు లయ బద్ధంగా నాట్యం చేస్తు
రుతూ గంతులు వేస్తుంది. అంతలోనూ ఆ కోతి, ప్రక్కనున్న
వైపు చూచి- కిచకిచా అ స్తుంది. తాత తలఎత్తి పుంత
చూచి, నవ్వుతూ-

వెంకూ...... తొందరగా రారా బాబూ, మారుతయ్య
స్తున్నాడు నీకోసం......" అంటూ ఓ కేక వేస్తాడు.

తదారి వెంట వస్తున్న వెంకూ గబ గబా మామిడితోపులో
సె ముందు కూర్చున్న తాత దగ్గరకు వచ్చి, భుజాన ఉన్న
సంచి దింపుకొని, అందులోని అరటిపళ్ళు రివ్వున పైకి ఎగుర
మారుతయ్య (కోతి) చటుక్కున పైకి ఎగిరి, ఆ పళ్లను క్రింద
అందుకుని, గబ గబా తినేస్తుంది.

"వెంకు బాబుకూ దణ్ణం పెట్టు
వెంకు బాబుకూ సలాము చెయ్యి"

-అంటూ తాత పాడగానే, కోతి సలాములు చేస్తూ వెంకూ ముందు కూర్చుని, అతని సంచీలో ఇంకా పళ్లు ఉన్నాయేమోనని చేతులు పెట్టి వెతుకుతుంది. దానితో కాస్సేపు ఆడి, "బడికి వేళవుతోంది తాతా! వెళ్లొస్తా......కోతిబావా, మళ్లీ వస్తానులే సాయంత్రం......" అంటూ పుంత దారి వెంట వెళ్లిపోతాడు వెంకూ.

ఇది మామిడితోట దగ్గర, రోజూ ఉదయం, సాయంత్రం జరిగే కథ.

*  *  *

సుమారుగా ఒక మైలు దూరంలో ఉన్న రెండు ఊళ్ల మధ్య ఉన్నది ఆ మామిడితోట! తాత ఆ మామిడితోటకు కాపలాదారు. అక్కడే ఓ చిన్న గుడిసె వేసుకుని ఉంటున్నాడు. జమీందారుగారు ఎప్పుడైనా వస్తే మకాం కోసమని ఓ చిన్న యిల్లు కూడా ఉంది అక్కడ. ఇంటిప్రక్కనున్న బావిలోని నీరు గంగా బొండాల్లాగా తియ్యగా ఉంటాయని అందరూ మంచినీళ్ళు త్రాగి వెడుతూ ఉంటారు. బాటసారులకా తోట చల్లని చలివేందరం! తాత ఆప్తబంధువూనూ!

చాలా పెద్ద తోట అది. పై నుంచి చూడటానికి ఎంత అందంగా ఉంటుందో ఆ తోట లోపలికి వెళ్ళడానికి అంత భయంకరంగా ఉంటుంది. ఆకాశానికి అంటుతున్నాయా అనిపించే పెద్ద పెద్ద చెట్లు. ఆ చెట్లనీడల్లో క్రింద పొదలు, అక్కడక్కడ పుట్టలూనూ, కావడానికి అవి చీమల పుట్టలే కావచ్చును... కాని చీమలు పెట్టిన పుట్టలు పాముల కిరవైనట్లు —అన్నట్లుగా, తోటలో పాములు తిరుగుతూ ఉంటాయనీ, ఎక్కడ ఏ పుట్టలో ఏ పాము ఉందో, ఎవరికి ఎరుక? అని అందరూ అనుకొంటూ ఉంటారు.

ఒకసారి, ఆ ఊరునుండి, ఈ ఊరుకు వెడుతూ ఉన్న ఓ దొమ్మరి ఆటగాళ్ళు తోటలోకి వచ్చి, తమవద్దనున్న ఓ కోతిని తాతకు ఇచ్చి వెళ్లి

పోయారు. ఆ కోతి కాలు విరిగి, దొమ్మరివాళ్ళ ఆటలు ఆడలేకపోవడంవల్ల, వాళ్ళకది బరువైపోయింది. "పోనీ తనదగ్గరే ఉంటుంది. తోటలో తనకు తోడుగా కూడా ఉంటుంది" అనుకొని తాత, దానికిన్ని పళ్ళు, కాయలు పెడుతూ పెంచుతూ ఉన్నాడు.

ఈ ఊరినుండి, అవతల ఊరిలో ఉన్న బడిలో చదువుకోడానికి వెళ్ళే వెంకుకు దారిమధ్యలో ఆ తోట, తాత, కోతి - పెద్ద నేస్తాలు. ప్రొద్దుట బడికి వెళ్ళేటప్పుడు, సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చేవేళ తోటలో ఆ కోతితో ఆడుకోవడం వెంకూకు సరదా. ఆ కోతి కోసం పళ్లు, కాయలు పట్టుకొని రావడం అతనికో పెద్దపని!

అసలు వెంకూకు ఎప్పుడు జంతువులంటే చాలా సరదా! ఇంట్లో ఓ కుక్కపిల్ల, ఓ పిల్లిపిల్ల అతనికి పెద్ద స్నేహితులు. కంచంలో పాలు పోసి పిలవగానే, కుక్కపిల్ల, పిల్లిపిల్ల చరచరా వచ్చి, కంచానికి ఎడా పెడా కూర్చుని, చక్కగా పాలన్నీ త్రాగేస్తాయి. వాటికంత మచ్చిక! వెంకూకు వాటితో అంత స్నేహం! ఇంట్లో కుక్కపిల్ల. పిల్లిపిల్ల, తోటలో కోతిపిల్ల - వెంకూకు వాటితోటిదే లోకం!

ఒకనాడు - చూస్తూ, ఉండగా - తోటదగ్గర గందరగోళం బయలుదేరింది. ఎవరో కొంతమంది తోటలోచేరి గొడవపడుతున్నారు. పుంత దారిలో వస్తూఉన్న వెంకూకు ఆ జనం గొడవలోంచి - కోతి అరుపులు భయంకరంగా వినపడ్డాయి. ఆ జనం కోతిని ఏదో చేస్తున్నారేమోనని భయపడుతూ, వెంకూ, "మారుతయ్యా మారుతయ్యా" అంటూ అరుస్తూ గబగబా తోటదగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చి "మా కోతిని ఏం చేస్తున్నాడు?" అంటూ ఖంగారుగా "తాతా, తాతా" అని అటూ ఇటూ కలయచూశాడు.

వెంకూ కేకలు విని. తాత, ఆ జనంలోంచి ఈవలకు వచ్చి "ఏం తాతరా నాయనా! మన మారుతయ్య చావుబతుకుల్లో ఉంది, చూడరా బాబూ" అంటూ, వెంకూ చెయ్యి పట్టుకొని, జనం ముందుకు తీసుకు వెళ్లాడు.

కోతిని చూడగానే, వెంకూ కళ్ళు తిరిగి చీకట్లు కమ్మాయి. వెంకూను చూడగానే ఇంకా బిగ్గరగా అరవడం మొదలెట్టింది కోతి.

కోతి చేతిలో ఉన్నది పామేనా? పామే! త్రాచుపాము! పాము తలను కోతి పిడికిటిలో గట్టిగా పట్టుకున్నదేమో, ఆ పాము కోతి చేతిని, నడుమును చుట్టేసి, బిగించేస్తోంది. ఆ నాగు పాశంలో నరనరాలూ పిట పిట లాడుతుంటే- ఆగలేక, కోతి వెర్రిగా అరిచేస్తోంది.

అసలు, ఆ కోతి పిడికిటిలోకి, ఆ త్రాచుపాము తల ఎలావచ్చిందో అచట చేరిన వాళ్లకు, అసలు తాతకు కూడా తెలియదు. ఏం జరిగిందో ఏమో! ఆ తోటలో తిరుగుతూ ఉన్న పామును చూచి, ఆ కోతి ఏమి కోతి చేష్టలు చేసిందో! లేక, ఆ పామే కోతిమీదకు వచ్చిందో- ఏం జరిగిందో ఎవ్వరూ ఎరుగరు! ఏమైతేనేమి, కరవబోయిన పాము తలను వదిలేస్తే అది కాటు వేస్తుందని కోతికి తెలుసు. అందుకే పాము తలను గట్టిగా పిడికిటిలో పట్టేసింది కోతి. ఆ పిడికిలి పట్టుతో ఊపిరాడక, కోతి చేతిని, నడుమునూ చుట్టేసి, బయటపడటానికి పెనుగులాడుతోంది పాము.........

ఆ పెనుగులాట, అరుపులు విని తాత హడలిపోయి, పుంతదారిని వెడుతూఉన్న వాళ్ళని పిలుచుకొచ్చాడు. కోతి పరిస్థితిని చూసి వాళ్ళందరూ, ఏమి చేయడానికీ తోచక, ఖంగారు పడిపోతున్నారు. తాత అసలే తల్లడిల్లిపోతున్నాడు.

ఇప్పుడేమి చెయ్యాలి? కోతిని ఎలా రక్షించడం? కోతిని కాపాడాలంటే, పామును చంపెయ్యాలి. పామును చంపెయ్యాలంటే కర్రతో కొట్టాలి. అలా కొడితే పాము, కోతి చచ్చిపోతాయి. ఎలాగ? కోతికి హాని కలగకుండా పామును చంపడం ఎలాగ? అదే- అచట చేరిన వాళ్లందరి ఆందోళనానూ. నిశ్చేష్టుడైన తాత, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ కూలబడ్డాడు. చెదిరిన మనస్సును చిక్కబట్టుకొంటూ- వెంకూ, తాత ఒళ్లో కూర్చున్నాడు. ప్రక్కనున్నవాళ్ళు ఎవరికి తోచిన మాట వాళ్ళంటున్నారు. పక్కనున్నవాళ్ళు ఎవరికి తోచిన మాట వాళ్ళంటున్నారు.

ఇంతలోనూ వెంకూ అన్నాడు- "ఈ కోతులు మనుషులు చేసినట్లు చెయ్యబోతాయి కాదూ!"

"ఔనురా బాబూ! అలా చెయ్యబోయి- ఆ దొమ్మరివాళ్ళ దగ్గర పెరిగిందిగా- వాళ్ళు పాములతో గరిడీలు చేస్తారుగా- అదంతా చూసి ఉంటుంది- పాము కనపడగానే, అలా చేయబోయిందేమో - ప్రాణానికి తెచ్చుకుందిరా మన కోతి. వెంకుబాబూ" అంటూ మూలిగాడు తాత.

"ఉండు తాతా, నాకో మంచి ఆలోచన తోచింది-" అంటూ, వెంకూ, ప్రక్కనఉన్న రాయి తీశాడు.

"కొడతావేమిటి ? కొట్టబోకు - కొట్టబోకు" అన్నాడు తాత కంగారుగా.

"కొట్టను తాతా-చూడు-ఏంచేస్తానో-" అంటూ వెంకూ, కోతికి కనపడేలా, ఎదురుగా కూర్చుని, ఆ రాయిని తన పిడికిలిలో గట్టిగా పట్టుకొని, పిడికిలిని నేలవైపు త్రిప్పి, కింద గట్టిగా రాయడం మొదలు పెట్టాడు. అలా ఆ రాయిని కొంచెంసేపు రాసేసరికి కోతి, వెంకూ ఉపాయాన్ని గ్రహించి, తన పిడికిలిని కూడా నేలవైపు త్రిప్పి, గట్టిగా నేల మీద రాయడం మొదలుపెట్టింది.

పిడికిలికి కొంచెం ఇవతలగా ఉన్న పాము తలభాగం నేలమీది రాపిడితో - చితికిపోయి, రక్తం కారడం మొదలుపెట్టింది.

అలా రాస్తూ, రాస్తూ ఉంటే, కొంచెం సేపటికి, కోతి చేతిని, నడుమును చుట్టుకున్న పాముచుట్ట - వదులై, ఊడి - క్రిందపడి గిలగిల తన్నుకొనసాగాయి. మరి కొంత సేపటికి, పాము తల అంతా అరిగి, చితికిపోవడంతో - దానిని చటుక్కున విసిరి, కోతి ఒక్క దూకులో తాతదగ్గరకు వచ్చిపడింది. వెంటనే అక్కడ ఉన్న నలుగురూ నాలుగు దెబ్బలు వేసి, గిలగిల తన్నుకుంటున్న పామును చంపేసేశారు.

పామును చంపి బైటపడిందిగానీ, కోతికి భయం తగ్గలేదు. శోషవచ్చిపడిపోయింది. ఇన్ని నీళ్ళు చల్లి తుడిచి, వెంకూ దానిని తన

ఒళ్లో పడుకోబెట్టుకున్నాడు. రెండు చేతులతోటీ వెంకూ నడుమును చుట్ట బెట్టి, కోతి అలాగే ఒగుర్చుతూ పడుకుంది.

"ఆ ...... బతికిందిలే, వెంకుబాబూ, పాము కరిచిందేమోనని భయపడ్డాను." అన్నాడు తాత, కోతిని నిమురుతూ.

"ఇక భయంలేదు తాతా. వెంకు బాబు ధర్మమా అని మూరు తయ్యా బతికింది" అన్నాడొక రైతు రంగన్న.

"కుర్రాడైనా, వెంకుబాబు తెలివి తేటలకు, ఉపాయానికి మెచ్చుకోవాలి" అన్నాడు మరో రైతు రంగన్న.

"ఎవరేమన్నా-కోతి వెంకూ ఒళ్ళోను, వెంకూ తాత ఒళ్ళోనూ - అలా పడుకునే ఉన్నారు.........

......పామును చంపిన పెద్దలు, పక్క ఊళ్ళోకివెళ్ళి వేడివేడి పాలు పట్టుకొచ్చి వాళ్ళ ముగ్గురికీ ఇచ్చేదాకా.........

"మామిడి తోపులో
మూసుతయ్యా కథ
మనిషి తెలివికి ఒక్క
మరపురాని కథ"






చిన్న సూట్ కేసొకటి చేత బట్టుకొని కిట్టూ బస్సుదిగి, తాతగారింటికి కాలి నడకను చేసుకున్నాడు. ఎదురుగుండా - గుమ్మంలోనే - పత్రిక చేతబట్టుకుని. తాతగారు నవ్వుతూ పలకరించారు. అమ్మమ్మ కళ్లతోనే నవ్వుతూ వచ్చి లోపలికి వెళ్లింది.

"అరె! వీళ్లకెట్లా తెలుసు తను వస్తున్నట్లుగా? ఉత్తరం రాయకుండా వచ్చి, వీళ్లందరినీ ఆటలు పట్టిద్దామనుకున్నాడు. ప్చ్ తన పథకమంతా చెడిపోయింది. ఏం చేస్తాం" అనుకుంటూ అమ్మమ్మతో లోపలికి వెళ్లాడు కిట్టూ.

"మినపసున్ని ఉండలు తింటూ మీ తాతగారితో కబుర్లు చెబుతూ ఉండు. వంటకావచ్చింది. వడ్డిస్తా" అంటూ లోపలికి వెళ్లిపోయింది అమ్మమ్మ.

హుషారుగా కబుర్లు చెబుతున్నాడు కిట్టూ తాతగారితో. మధ్యలో అడిగాడు కిట్టూ "తాతయ్యా నేను వస్తున్నట్టు నీకు తెలుసా ముందే?"

"అవును తెలుసు, మీ అమ్మ ఉత్తరం రాసింది నీవు వస్తున్నట్టు" అన్నాడు తాతయ్య.

అంతలో మేనమామ శీను వచ్చాడు. "ఏయ్, పరీక్ష బాగా రాశావా? మీ అమ్మ నిన్ను చాలా పొగుడుతూ ఉత్తరంరాసింది. నీవు బాగా చదివావట. పరీక్షల్లో బాగా రాశావట, క్లాసు వస్తుందని రాసింది" అన్నాడు కిట్టూను చూడగానే సంబరపడిపోతూ.

"బాగానే రాశాలే" అన్నాడు నవ్వుతూ కిట్టూ మనసులో ఏదో విషయం గడబిడ చేస్తున్నది. అది బైటికి చెప్పే వరకూ మనసు ఆగటం లేదు.

"తాతయ్యా - అమ్మమ్మా - శీను మామయ్యా అంతా వినండి. నేను ఒక తమాషాచేసి అమ్మకూ నాన్నకూ కాస్త కోపం వచ్చేటట్టు - చేశాను. మొదట కోప్పడినా తరువాత సంతోషించాములే" అన్నాడు అందరి ముఖాలలోకి చూస్తూ.

"పెద్దవాళ్ళతో నీకేం తమాషారా?" అన్నది అమ్మమ్మ ముఖం గంభీరంగా పెట్టి.

"ఒరేయ్, దేవుడి తరువాత పూజించవలసిన వాళ్ళు తల్లిదండ్రులేరా? వాళ్ళతో నీకు హాస్యమూ?" అన్నాడు శీను మామయ్య.

తాతయ్య నవ్వుతూ కిట్టూనే చూస్తున్నాడు ఏం చెబుతాడోనని.

"నేను నిరుడు నా పుట్టినరోజు తరువాత ఒక చిన్న పిడత కొనుక్కున్నాను డబ్బులు దాచుకోవటానికి. ఆపిడతకు మూతపైన డబ్బులు వేయటానికో సందు ఉంటుంది. అది నిండినతరువాత ఆ పిడతను పగుల గొడితేనేగాని డబ్బులు బైటికిరావు. నాన్నా అమ్మా నాకు అప్పుడప్పుడు ఇచ్చిన డబ్బులన్నీ దానిలో వేసుకున్నాను. దసరాకు తాతయ్య ఇచ్చినవీ అమ్మమ్మ ఇచ్చినవీ కూడా దానిలోనే వేశాను. వారం రోజుల క్రిందట నా పుట్టినరోజు వచ్చిందిగా ? ఆనాటికి నాకు మంచి బట్టలు కొనాలని నాన్నా అమ్మ అనుకున్నారు. వాళ్ళదగ్గర ఉన్నడబ్బు చాలక పోతే నా పితడలోవి కూడా తీసుకుందామనుకున్నట్లున్నారు. ప్రతి రోజూ నేను పిడత పెట్టినచోటు చూడాలని నాన్నా అమ్మా వెదకటం మొదలుపెట్టారు, నేను వాళ్ళకు కనబడకుండా దాచేనని అనుమానిం

చారు. ఒకనాడు నన్నడిగారు. "నాదగ్గరలేవు, అప్పుడే ఖర్చయ్యా యని" చెప్పాను. నాన్నకు కోపంవచ్చి "ఏం ఖర్చు చేశావురా" అన్నాడు కొంచెం కోపంగా.

"నేను ఇంట్లో చేసి పెడుతుంటే బయట చిరుతిండ్లు కొనుక్కొని తింటున్నావురా ? దేనికి ఖర్చు చేశావో చెప్పు" అన్నది అమ్మ కళ్ళెర్ర చేస్తూ.

వాళ్ళిద్దరూ ఒకరి తరువాత ఒకరు కోప్పడుతుంటే నాకేమీ కోపం రాలేదు. పైగా నామనసు ఎంతో గంతులు వేస్తున్నది. కొంత సేపు ఓపిక పట్టిన తరువాత అన్నానుగదా : "మీరు నా కిచ్చిన డబ్బు కోసం ఎందుకు ఇంతగా అడుగుతున్నారు ? అదీ గాక అందులో ఉన్నదంతా మీరిచ్చిందికాదు.

"కాదనుకో, కాని - నీవు ఏం ఖర్చు చేశావోచెప్పు" మళ్ళీ ఇద్దరూ గద్దించి అడిగారు.

నేను ఎప్పుడూ వాళ్ళిద్దరూ ఇంత నిక్కచ్చిగా అడుగుతారనుకో లేదు. ఏంచెయ్యను? అదీగాక ఎప్పుడూ ఇలా జరగలేదు.

"ఎప్పటి కప్పుడు ఖర్చు చేశానమ్మా, ఏదో కొనుక్కొనేవాళ్ళం నలుగురం కలిసి" అన్నాను బిక్కముఖంపెట్టి.

తాతయ్యకు ఇంతలో కోపం వచ్చింది. పత్రిక బల్లమీద విసిరి పడే శాడు. 'నీవు ఏం ఖర్చు చేశావో చెప్పక వాళ్ళను ఎందుకు రెచ్చగొట్టావు? సినిమా కెళ్ళావో, హోటళ్ళకే వెళ్ళావో చెప్పలేక పోయ్యావా?' అన్నాడు కనుబొమలు ముడుచుకుంటూ తాతయ్య

కిట్టూను వాళ్ళిద్దరూ కలిసి కొట్టారేమోనని బాధపడుతోంది అమ్మమ్మ.

'స్నేహితులు నలుగురు చేరితే డబ్బు ఖర్చుకాదేమిటి?' అన్నాడు శీను మామయ్య. కిట్టూ గలగల నవ్వేశాడు.

'పూర్తిగా విననండి మరి, వాళ్ళకు నా డబ్బులమీద అంత ఆశ ఎందుకు? కొంత డబ్బు బట్టలు కుట్టిద్దామని విడిగా పెట్టారు. అది కాస్తా దేనికో ఖర్చయి పోయిందట. అంతకు ముందు అమ్మామ్మానాన్నా నాకు ఈ టెరికాట్ ప్యాంటు, బుష్‌షర్టు కుట్టిద్దా మనుకుంటున్నామని చెప్పారు. ఇప్పుడా డబ్బు ఖర్చయి పోయిందికదా! మాట నిలుపుకోలేకపోతామన్న బాధ కొద్దీ నా పిడతలో ఉన్న డబ్బు కోసం చూశారు'

ఇంతవరకూ చెప్పిన తరువాత తాతయ్య "అసలు నీవు చేసిన ఖర్చేమిటో చెప్పు?" అని గట్టిగా అరిచాడు.

"తాతయ్యా, నేను చెప్పేది సాంతంగావింటే నీవిల్లా అరవవు" అన్నాడు కిట్టూ. "తొందరగా చెప్పుమరి?" ఇక ఆగలేనట్టుగా అన్నాడు తాతయ్య.

"మా మాస్టరుగారిని ఎరుగుదువా తాతయ్యా? చిన్నప్పుడు ఓనమాలు దిద్దించిన దుర్గయ్యగారు? ఆయన ఇప్పుడు పెద్దవాడయినారు. రిటైరయినా డబ్బు సంపాదించకపోతే ఇల్లు గడవదు. అందుకని వీధి అరుగుమీద చాపవేసుకుని పదిమందిపిల్లలకు చదువు చెబుతారు. పది మందీ కలిసి నూరు రూపాయలిస్తారు. కష్టంమీద భోజనం గడుస్తోంది. నేను వారానికి ఒకసారయినా ఆయన దగ్గరకి వెళ్ళి మాట్లాడి వస్తూ ఉంటాను. ఒకసారి నేను వెళ్ళినప్పుడు కళ్ళజోడు కాస్తా పగిలిపోయింది. పిల్లలకు పాఠాలుచెప్పటం కష్టంగా ఉందన్నారు. ఆయన భార్య మాధవమ్మగారు కళ్ళనీళ్ళుపెట్టుకున్నారు. తాతయ్యా, ఆ మాటలకు నాకూ కళ్ళనీళ్ళువచ్చాయి. ఆ సాయంకాలము నా పిడత పగలగొట్టి ఎంత డబ్బుందో చూశాను. అరవై రూపాయలు ఇంకా కొంత చిల్లరా ఉంది. అవి తీసుకుని మా మాస్టరుగారిని కళ్ళ డాక్టరికి చూపించి కళ్ళద్దాలు కొనిపెట్టాను, ఇది జరిగిన మరునాడే నాన్నా అమ్మా డబ్బు సంగతి అడిగారు' చాలా గర్వంగా చెప్పాడు కిట్టు.

'మరి ఈ మాట నాన్నతోనూ అమ్మతోనూ ముందే చెప్పలేక పోయావా?' తాతయ్యకు మనసులో సంతోషం పొంగుతోంది.

"వాళ్ళు నా పుట్టినరోజు ఏం చేయదలచుకున్నారో చూడాలనే చెప్పలేదు తాతయ్యా. రేపు పుట్టిన రోజనగా ఇద్దరూ ముఖాలు చిన్న బుచ్చుకుని ఒక తెల్ల పాయిజామా ఒక తెల్లటి షర్టు కొనుక్కొచ్చారు నాతో సరిగా మాట్లాడలేదు. మరునాడు తలంటిపోసింది అమ్మ. పాయసం చేసింది. ఆ బట్టలు తొడుక్కుని పాయసం తినమంది. నేను నవ్వుగా నవ్వుకుంటూ కొత్తబట్టలు తొడుక్కుని నాన్నకూ అమ్మకూ కాళ్ళకు దణ్ణం పెట్టాను. నాన్నా అమ్మా- "నీకీసారి మంచి బట్టలు కుట్టిద్దామను కున్నామురా, అనుకోకుండా ఖర్చులు వచ్చాయి" అన్నారు. ఈ మామూలు బట్టలు కొన్నందుకు బాధగా ఉందన్నారు.

నేను వాళ్లిద్దరి మధ్యగా నిలబడి వాళ్ళ చేతులు పట్టుకుని 'అమ్మా నాన్నా నాకు టెరికాట్ బట్టలకంటె నాకు ఓనమాలు దిద్దించిన గురువు గారికి సహాయ పడాలనిపించింది. ఆ మాట మీకు చెబుదామంటే వద్దంటా రేమోనని భయంవేసింది. మీరు డబ్బు ఖర్చు అయిపోయిందనుకోవటం విన్నాను నా డబ్బుల పిడతను వెతకటం గమనించాను. వాటిని నేను ఈ విధంగా ఖర్చుచేశాను. మీరిద్దరూ నన్ను క్షమించాలి. నాకిప్పుడు ఈ బట్టలే ఎంతో బాగున్నాయి. నా గురువులకు తోడ్పడిన తృప్తి మిగిలింది' అంటూ ఆ చేతులను కళ్ళకద్దుకున్నాను" అన్నాడు కిట్టూ. తను చేసిన పని తాతయ్య కూడా మెచ్చుకుంటాడన్న ఆశతో.

"నాయనా కిట్టూ, చాలా మంచి పనిచేశావు" అని అమ్మమ్మ అతడి తలను గుండెకు చేర్చుకుంది.

శీను మామయ్య నోరు తెరిచాడు. "చిన్నవాడవయినా పెద్ద పని చేశావురా. అందరూ మెచ్చే పని చేశావు. నాకు నచ్చింది. ఇంతకూ నాన్న అమ్మా ఏమన్నారు" అన్నాడు, తాతయ్య.

నవ్వాడు కిట్టూ 'ఒరే మాకు తోచలేదురా ఈ మాట! పాపం పంతులుగారిని ఒకసారి చూసి వద్దాం పదా! నాలుగు బత్తాయి పండ్లు తీసుకు వెళ్దాం' అన్నారు తాతయ్యా. వాళ్ళ కోపం కాస్త గాలి కెగిరి పోయింది' అన్నాడు కిట్టూ నవ్వుతూ.

అందరూ కిట్టూను చూసి మురిపెంగా నవ్వుకున్నారు.




సాయంత్రం నాలుగు గంటల వేళ. 'నర్సరీ స్కూలు వాన్' వచ్చి సముద్రతీరంలో ఆగింది. బిలబిల మంటూ పాతిక మంది పిల్లలు బయటకి దుమికారు. వెంట ఇద్దరు ఉపాధ్యాయులు ఉన్నారు. సముద్ర వంక చూడగానే పిల్లల మనస్సుల్లో ఏవేవో భావతరంగాలు లేచినాయి. దానికి తగ్గట్టుగా ఉపాధ్యాయినులు "ఆడుకోండి - మీ ఇష్టం వచ్చినం ఆట ఆడుకోండి. చిన్న చిన్న గుంపులుగా మారిపోండి. స్నేహభావాలతో స్వేచ్ఛగా ఆడుకోండి" అని హెచ్చరించారు.

నలుగురు చేరి ఇసుకలో పిచ్చుక గూళ్లు కడుతున్నారు. అలా మూడు చోట్ల వారి భావిస్వప్నాల లాటి నైతికగృహం నిర్మాణం జరుగుతోంది. ఎవరికి వారు తాము కడుతున్న ఆ గృహాలవద్ద నిలబడి "ఇది మావూరు. దీనిపేరు "గాంధీనగర్". చక్కటి వీధులు వేయాలి. మధ్యనొక గుడికట్టాలి. కొంచెం దూరంలో ఒక బడి" అని సంబరంగా చెప్పుకొంటున్నారు. అంతాకలసి ఒకసారి "మావూరు" అని కేకలు పెట్టారు. అది అవతల బృందం వద్ద ప్రతిధ్వనించింది. అదేకాక అక్కడా వినిపించింది. గ్రామాన్ని ఎంత అందంగా చేయాలి? అనే సమాలోచన జరుపుతున్నారు అన్ని బృందాలవారు. ఊహలు మనస్సుల్లో ఉరకలు వేస్తున్నాయి. ఉత్సాహంతో చర్చిస్తున్నారు.

ఇంతలో తక్కినవారు దగ్గరలో గల చిన్న చిన్న పొదలలోకి వెళ్లి కొమ్మలు, రెమ్మలు విరుచుకు వచ్చారు. నూతనంగా నిర్మించిన ఈ గ్రామాల నడుమ సన్నటి మార్గాన్ని ఏర్పాటు చేశారు, దాని కిరు ప్రక్కల ఈ పూల కొమ్మలు నాటుతున్నారు. ఒక కుర్రవాడు వచ్చి ఆ మార్గంలో ఒక అడుగు దూరం మొక్కలు నాటకుండా వదలా లన్నాడు. "ఎందుకు?" అని ప్రశ్నించారు అవతల వాళ్లు. "ఎందు కేమిటి? ఇక్కడ వంతెన వస్తుంది. రోడ్డు కిందగా వంతెన లేకపోతే కాలువ లెలా ప్రవహిస్తాయి? పంటలెలా పండుతాయి? పథకమంతా నేను వేస్తున్నాను". అని అక్కడ దారికడ్డంగా గొయ్యి తవ్వి దానిమీద ఎండుపుల్లలు పరిచి దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. "ఇంజనీరుగారూ, మీరీ విషయం ఆలోచించండి. మేం తక్కినపని ఆలోచిస్తాం." అని ముందుకు పోయారు కొందరు బాలలు. ఇలా గంట గంటన్నర కాలం గడిచింది. గుడి వుండవలసిన చోట చిన్న శంఖాలకుప్ప పోశారు. బడివుండవలసిన చోట ఆలిచిప్పలతో మేడ కట్టారు. అవతలి బృందంలోంచి ఒకరిద్దరు పరిగెత్తుకువచ్చి ఈ ఈ నమూనాలు చూచి పోతున్నారు. తక్కినచోట్ల కూడా అదే విధంగా నిర్మాణాలు జరుగుతున్నాయి.

ఆ చిన్నారి కలలోనుంచి వెన్నెల వలయాలుగా తిరిగిన భావాలు మూడు గ్రామాలుగా వెలిసినాయి. కొంచెం దూరంలో సముద్రతీరంలో పచార్లు చేస్తున్న ఉపాధ్యాయులు పిల్లల భావాలకు ఉప్పొంగి పోతు న్నారు. వారి నేత్రాలు పాతిక సంవత్సరాల అవతల కాలానికి చూపుల వంతెన కట్టినట్లుంది.

పిల్లలు అన్నట్లు ఒక రైలు మార్గము కూడా ఉండాలి. లేకపోతే గ్రామాలు వెనుకబడి పోతాయి. నగరాలతో సంబంధం ఉండదు. రైలు మార్గం త్వరలో పడాలి—దగ్గరలో పడాలి అనుకొంటున్నారు.

ఇంతలో మసకవెన్నెల వచ్చిపడుతున్నది. సముద్రుడు కలనేత కెరటాలు దొర్లిస్తున్నాడు. వాటి గర్జన ఇనుమడిస్తోంది. ఉపాధ్యాయులు ఈల వేశారు. పిల్లలందరూ మెల్లగా వారి దగ్గరకు చేరారు. "కాళ్లు చేతులు కడుక్కోండి, ఇంటికి వెడదాం. మీరు కట్టిన గ్రామాల గురించి రేపు బళ్లో పాఠాలు చెపుతాం" అన్నారు పిల్లలతో. పిల్లలందరూ వరు

సగా నిలబడి సముద్రునివంక చూచి "స్వామీ, రేపు వచ్చేదాకా మా గ్రామాలు ఇలాగే ఉండాలి. వాటిని కెరటాలతో పడగొట్టవద్దు. మీకు మొక్కుతాం" అన్నారు. తరువాత చేతులు పైకెత్తి ఆకాశం వంక చూస్తూ "ప్రభూ, మా గ్రామాల్ని కాపాడు" అన్నారు— బరువెక్కిన కంఠంతో మళ్ళీ ఈల మ్రోగింది. పిల్లలందరూ క్రమశిక్షణతో ఒక వరుసలో నిలబడ్డారు. ఆ రంగుల పూలదండ వాన్‌లో ముడుచుకుపోయింది.

వాన్ హారన్ మ్రోగింది. కొత్తగా నిర్మించిన ఆ గ్రామాలలో అది ప్రతిధ్వనిస్తూ తీయగా మ్రోగింది.






పన్నెండు గంటలు దాటి ఉంటుంది. గోపి మంచి నిద్దర్లో
న్నాడు. దూరంగా ఎక్కడో నక్కల అరుపులూ, కప్పల బెక
వినిపిస్తున్నాయి. అసలే అమావాస్య! కన్ను పొడుచుకున్నా
కాను చీకటి. దోమల బాధకు తట్టుకోలేక గోపి అమ్మా
అటు నుంచి ఇటూ, ఇటు నుంచి అటూ దొర్లుతున్నారు. అంత
న్న గోపి ఒక్కసారిగా "అక్కయ్యా" అని ఇల్లెగిరి పోయేటట్లు
పెట్టాడు. అసలే నిద్రపట్టని గోపి అమ్మానాన్నలు ఆ కేకకు
యి గోపి మంచం దగ్గరకు పోయి, కలవరిస్తూ గడగడ వణికి
గోపీని తట్టి లేపారు.

అమ్మా! అక్కయ్య వస్తున్న రైలుకు ఏక్సిడెంటయిందమ్మా...
య్యకు బాగా దెబ్బలు తగిలాయి ... వళ్లంతా నెత్తురు. ఒక్క
య్యకే కాదు...రైలులో వున్న వాళ్లంతా నా అక్కలేనమ్మా.
దెబ్బలు తగిలాయి." అంటూ గజగజవణికి పోతూ అన్నాడు.
ధారలు ధారలుగా చెమటలు కారుతున్నాయి.

"చూడు నాయనా గోపీ, ఇది మనయిల్లు, నీకేదో పీడ కల వచ్చి
ది. రైలులేదు, అక్కయ్యా లేదు. అంతకంటే ఏక్సిడెంటూ
దిగో కళ్లు బాగా తుడుచుకుని ఇటు చూడు" అంది తల్లి.

గోపీ కళ్లు తెరచి చూశాడు. అతనికి బా
"ఇది కలా! నిజంగా కలేనా ... అక్కయ్యకి
మాచేగా" అని మళ్లీ కళ్ళు మూసుకు పడుక
డన్న మాచేగాని గోపీ గజగజ వణికిపోతూనా
కూడా ఉంది.

"జడుసు కున్నాడేమో, పిచ్చి సన్నాసి"
"ఆ స్కూల్లో స్ట్రయికు చేస్తున్నారటగా.
వీధీ తిరిగి తిరిగి రాత్రి పదిగంటలకు కొంపకు
డెక్కడ తిరిగొచ్చాడేమో. ఉండండి. కాస్త వీ
అమ్మ పూజామందిరంలో విభూతి తెచ్చి గోపీకి
వేసుకు దగ్గరగా పడుకుంది....

"రాధ వస్తోందని వాడితో చెప్పావా?"

"వాడు రాగానే అక్కయ్య రేపు ఉద
టరా"! అని చెప్పాను.

"ఆ మాట విన్నప్పటినుంచీ అదోలా అయ
పేరు చెబితే ఎగిరి గంతేసే వాడికి ముఖాన
చేతనో"? అని బాధపడిపోయింది తల్లి....

తల్లి పక్కనే పడుకున్న గోపి నిద్దర్లో
డెంటు! అక్కయ్యకు ఏక్సిడెంటు?" అని కలవ

తెల్లవారు జామున మూడు గంటలకి చ
గోపీ తల్లికీ, తండ్రికీ బాగా నిద్దర పట్టేసింది.

కొంత సేపటికి మెలుకువ వచ్చి చూసేసరి
లేదు. తల్లి లేచి "గోపి గోపీ" అంటూనే కేక
వెతికింది. ఆ కేకలకు గోపీ నాన్న కూడా లేచి
దొడ్డియును, వాకిటయును వెతకటం ప్రారంభిం
లేదు.

గోపి తల్లి బావురు మని ఏడవడం ప్రారంభించింది. గోపి తండ్రి కంగారుతో వణికిపోతున్నాడు. గోపి ఏమయినట్లు ?

ఇంతలో ఎవరో వీధిలో వెళ్ళుతున్నట్లు అలికిడయితే, గోపి తల్లి దండ్రీ బయటకు వచ్చి "మీకెవరికన్నా మా గోపీ కనిపించాడా?" అని అడిగారు. కొంతమంది మాకు తెలియదన్నారు. ఒకడు మాత్రం "మీ గోప్పి రైలు పట్టాల వెంట పరుగెట్టుకు పోతున్నాడు" అని చెప్పాడు. "రైలు పట్టాల వెంటా!" అంటూ ఆశ్చర్యపోయి ఉన్న పళంగా అన్నీ అలాగే వదిలి, యింటికి తాళమన్నా వేయకుండా, భార్యాభర్తలిద్దరూ రైలు పట్టాల వైపు పరుగెత్తారు. వాళ్ళకు ఫర్లాంగు దూరంలో పట్టాల మీదుగా పరుగెట్టుకు పోతున్న గోపి కనుపించాడు. "గోపీ గోప్పీ" అంటూ వెంటబడ్డారు. ఎంత పిలిచినా పలక్కుండా గోపీ పరుగెడుతూనే వున్నాడు. ఎదురుగా రైలు వస్తున్నది ... గోపి చేతిలో ఏదో ఉంది. ఎఱ్ఱిగుడ్డతో కట్టిన జండా ఊపుకుంటూ రైలుకు ఎదురు వెళ్లుతున్నాడు. బ్రహ్మరాక్షసిలా పొగలు జిమ్ముకుంటూ రైలు అతని మీదకు వచ్చే స్తోంది. గోపి అమ్మా నాన్నా "గోపీ గోప్పి" అంటూ గుండెలు బద్ద లయ్యేలా అరిచేస్తున్నారు. ఫర్లాంగు, వందగజాలు, పదిగజాలు, రైలు ఆగిపోయింది — గోపి చేతిలో ఎఱ్ఱిచొక్కా జండా చూసి! అప్పటికే బాగా వెలుతురు వచ్చింది. సూర్యభగవానుడు జానెడు ఎత్తున కొండ మీది కొచ్చేశాడు.

డ్రయివరూ వగైరా వగైరా రైలుదిగి గోపి దగ్గరకొచ్చి కారణమడిగారు. "మీ రైలు ముందుకు రానీయకండి. పట్టాలకున్న సీలలు రాత్రి విద్యార్థులు తీసేశారు. రైలు ఏక్సిడెంటవుతుంది" అని చెప్పాడు గోపి. అందరూ పట్టాలకు దిగువకు వెళ్ళి చూశారు. గోపి చెప్పింది నిజమే, పట్టాలకున్న సీలలన్నీ తీసేసున్నాయి. డ్రయివరూ రైలు ప్రయాణీకులూ, అందరూ గోపి ధైర్యానికి, చేసిన సాయానికి మెచ్చుకున్నారు. రైల్లోంచి గోపి అక్కయ్య "ఒరే గోపి!" అని కేకే సింది. గోపి అక్కయ్య దగ్గరకు పరుగెట్టాడు. అక్కయ్యల ముఖాలూ, తమ్ముళ్ళ ముఖాలు, పసిపాపల ముఖాలు, పెద్దవాళ్ల ముఖాలు కళకళ లాడుతూ నవ్వుతున్నాయి. గోపి రైలును ఆపకపోతే ఇంతమందికి ఉప

యోగపడే ఈ రైలూ, రైలులోని వారు
గోపి ముఖంలో నవ్వులేదు. ఏదో అంతు
ఏక్సిడెంటు జరిగితే, యింతమంది నిరపరా
రైలూ తునాతునకలయి పోయే వారేగ
అతను నిలువెల్లా వణికిపోయాడు.

తెలియని ఖంగారుతో వణికి పోతు
ఇంటికి తీసుకువచ్చారు. ప్రమాదం తప్పిన
దాన్ని తప్పించిన గోపి విషయం వూరంత
మంది గోపీ యింటికి వచ్చి గోపి నాన్నగా
గొప్ప పనిని గురించి పొగిడి వెళ్ళిపోయార

సాయంత్రం స్కూలులో పెద్ద స
హెడ్మాస్టారు స్కూలుకు తీసుకువెళ్ళి,
అభినందిస్తూ ఉపన్యాసం మొదలు పెట్టాడు

"విద్యార్థులు విద్యార్థులుగా ఉండ
పడుతున్నారు. ఓ చిన్న విషయాన్ని
కొండంతలు చేయడము— స్ట్రయిక్ లంటు
సంబంధంలేని విషయాల్లో ప్రమేయం పెట్టు
ప్రభుత్వ కార్యాలయాలను ధ్వంసం చే
చేస్తున్నారు. ఇది వారికీ, దేశానికీ కూడా
మన గోపీ తప్పించాడు. ఇతన్ని చూచి
వేమో మీరు చూచుకోండి." అంటూ హెడ్
గోపాలమూ కరతాళ ధ్వనులు చేస్తూ "
మెడలో దండలు వేశారు.

వూరంతా కాదు, ప్రభుత్వం కూడా
బహుమతి కూడా యిచ్చి సత్కరించింది.




శోణపురంలో వుంటున్న వీణాగుప్తుడు వెనుకాముందూ చూడకుండా రెండు చేతులా ఆర్జించి కోటికి పడగెత్తాడు. జీవితంలో చాలా భాగం గడిచిపోయిన తర్వాత అతడు వెనక్కి తిరిగి చూసుకొనేసరికి ఏముంది? తను ఎన్నో అక్రమాలు, అన్యాయాలు చేసి ధనం కూడబెట్టిన విషయం స్ఫురణకు వచ్చింది. దానితో అతడికి పాపభీతి పట్టుకున్నది. ఏ కొద్ది పుణ్యం కూడా సంపాదించలేకపోతినే అనే దిగులుతో ఒక రోజున ఒక పండితుని వద్దకు వెళ్లి తన బాధ వెళ్లబోసుకున్నాడు.

ఆ పండితుడు పరమార్థాన్ని సూక్ష్మంగా చెబుతూ, "అయ్యా, సరుకులు కొని వ్యాపారం చేసినట్లే అర్థంతో పుణ్యం అనే సరుకును ఖరీదు చేస్తూ ముక్తి అనే పరమార్థాన్ని గడించవచ్చు" అని సలహా చెప్పాడు.

ఆ మరుసటి రోజున వీణాగుప్తుడు తన భవంతి ముందు 'ఇక్కడ పుణ్యం కొనబడును' అని అట్టమీద పెద్ద అక్షరాలతో వ్రాయించి, వేళ్ళాడదీశాడు.

జీవితంలో అంతో యింతో
శోణపురంలో లేకపోలేదు. వాళ్ళ
వీణాగుప్తుడి నివాసానికి రాసాగా

పుణ్యం అమ్మేవారు తావ
తున్నామంటూ, త్రాసులో ఒకప్ర
వాడిది నిజమైన పుణ్యమే అయితే
తర్వాత వీణాగుప్తుడు రెండవవై
ఎవరి ఎవరి పుణ్యఫల భాగాన్ని
తూగుతూ వుంటుంది.

శోణపురానికి నాలుగామడ
సోమయ్య, సోమిదమ్మ అనే పుణ
ఆస్తి పుణ్యకార్యాలకు హారతికర్పూ
దమ్మ ఒక రోజున భర్తతో వీణా
ధర్మాల పేరిట అతిగా ఖర్చుపెట్టి
హెచ్చుగానే వుండి వుంటుంది. మీ
ధనంతో యిల్లు గడిచేటట్టు చూడ
యిష్టం లేకపోయినా, ఇల్లాలి మా
నికి బయలుదేరాడు. సోమిదమ్మ
భర్తకు యిచ్చింది.

సోమయ్య పోయి పోయి
పురం సమీపంలో వున్న నిర్జన ప్ర
చెట్టునీడన కూర్చుని రొట్టెల మూ

అతడు ఒక రొట్టె తినబో
ఒకటి పరిగెత్తుకుంటూ వచ్చి సో
చూడటం ప్రారంభించింది. సోమ
తోడు ఎవరూ లేరనుకున్నాను. ...
బోయే రొట్టెను అందించాడు.

కుక్క ఆ రొట్టెను ఆవురావురు మంటూ తినేసి, మళ్ళీ సోమయ్యా కేసి చూస్తూ తోకాడించసాగింది. "ఓహో, నీకు ఆకలి తీరినట్టు లేదే!" అంటూ సోమయ్యా రెండవ రొట్టెనుకూడా దాని ముందు వేశాడు.

అది దాన్ని కూడా గుటుక్కున మింగేసి, తిరిగి తోకాడించడం మొదలు పెట్టింది. "ఇక వున్నది ఒక్కటే రొట్టె! దీన్ని తిని నీ ఆకలి చల్లార్చుకో" అంటూ సోమయ్యా దాన్ని కూడా కుక్క ముందు పడేశాడు.

అతడిభావం గ్రహించినట్టు కుక్క రొట్టెముక్కను నోట కరుచుకుని, వెనక్కి తిరిగి చూడకుండా పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయింది.

ఉన్నంతలో ఒక ప్రాణికి ఆకలి బాధ తీర్చానన్న ఆత్మతృప్తితో సోమయ్యా ఆ పక్కనే వున్న బావి నీళ్ళు కడుపునిండా త్రాగి, తిన్నగా వీణాగుప్తుడి దగ్గరకు వచ్చాడు.

వీణాగుప్తుడు సోమయ్యా పుట్టు పూర్వోత్తరాలన్నీ తెలుసుకుని, "అయ్యా! కొంత పుణ్యాన్ని మీరు అమ్మదలచుకున్నా, అది ఎంత పుణ్యం అనేది తెగని సమస్య అవుతుంది. అంచేత మీరీమధ్య చిన్న పుణ్యం ఏదైనా చేసివుంటే దాన్ని యీ త్రాసులో వదలండి. ఆ పుణ్యఫలానికి సరితూగే బంగారం యిస్తాను" అన్నాడు.

సోమయ్యా సిగ్గుతో తలవంచుకుని, "మీ దగ్గరకు వచ్చేటప్పుడు నా భార్య యిచ్చిన మూడు రొట్టెలు తినబోయే సమయానికి ఓ కుక్క వచ్చింది. మూడు రొట్టెలూ ఆ కుక్కకు పెట్టాను. అదేమైనా పుణ్యం అని మీరు భావిస్తే దాన్ని మీకు అమ్ముతాను" అన్నాడు.

అందుకు వీణాగుప్తుడు సంతోషంగా అంగీకరించాడు. సోమయ్యా చేతిలో నువ్వులు వేసుకుని దానిమీదుగా నీళ్ళధార త్రాసు సిబ్బెలోనికి వదులుతూ, "కుక్కకు రొట్టెలు వేసిన పుణ్యాన్ని త్రాసులో వేస్తున్నాను" అన్నాడు.

అతడలా అన్న వెంటనే త్రాసు సిబ్బె క్రిందికి దిగి నేలకు ఆనింది.

వీణాగుప్తుడు ఇంటిలో నుంచి బంగారం
సిబ్బెలో వేశాడు. అయితే ఆ బంగారం సోవ
సరిపోలేదు. అతడు మరి కొంత బంగారం తె
అయినా త్రాసు క్రిందికి మొగ్గుచూపలేదు. ఇ
అధికంగా తెప్పించి కొద్ది కొద్దిగా త్రాసులో
ఫలితం కనిపించలేదు.

దానితో వీణాగుప్తుడు దిగులు పడిపో
టిది ? ఇంతకు వెయ్యింతలు పుణ్యం అమ్మిన
వాళ్ల పుణ్యానికి యింత బంగారం ఎప్పుడూ
ఎంత బంగారం తూగుతుందో తెలియదు.
అనూహ్యంగా వుంది" అన్నాడు. సోమయ్య
నవ్వుతూ, "అయ్యా, లోగడ మీకు అమ్మిన
చేసి వుంటారు. అయితే నేను చేసిన ధాన ధ
కార్యాలు కానీ నిష్కామంతో చేశాను. మ
బరువులో విలువలో తేడా వున్నట్టే, స్వార్ధపు
రహితమైన పుణ్యసంపాదనకూ తేడా వున్నది
పాటి పుణ్యఫలం ఎంత అమూల్యమైనదో ఋ
కటిక దరిద్రం అనుభవిస్తాను. కానీ పుణ్యఫ
అందుచేత నా పుణ్యఫలాన్ని త్రాసులోంచి
అన్నాడు.

అతడలా అన్నదే తడవు, బంగార
త్రాసు భాగం తటాలున నేలకు ఒరిగిపో
తన గ్రామం చేరుకుని పై కండువాకు దారి
రాయిని మూటగట్టి తెచ్చి భార్యచేతిలో పె
వుండి నామొర ఆలకిస్తే అది బంగారు ముద్దే
వుత్త మట్టిగడ్డే అనుకో" అన్నాడు.

భర్త మాటలకు సోమిదమ్మ ఆశ్చ
చూసింది. దానిలో పెద్ద వజ్రం వుంది.

సోమయ్య తన కళ్ళను తనే నమ్మలే
తిన్నగా తీసుకుని ఆ దేశాన్ని పరిపాలించే వ
మహారాజు సోమశర్మకు ధన కనక వస్తువాహ
సత్కరించి పంపాడు. సోమయ్య దరిద్రం క



# నీతిని మ్రింగిన చపాతీ

వాకాటి పాండురంగారావు

వెంకట్రావుగారు నెలకి వంద పాతిక రూపాయలు సంపాదిస్తూ వుండే వారు. ఆయన భార్య రత్నం. వాళ్ళిద్దరికి లేక లేక కల్గిన బిడ్డ గోపి. ఈ కథ జరిగినప్పటికి గోపికి యింకా అక్షరాభ్యాసము జరగలేదు.

వెంకట్రావు గారు ఓసారి 'ఎగ్జిబిషన్' లో ఓ చక్కని అద్దాన్ని ఆరు రూపాయలిచ్చి కొన్నారు. చుట్టూ నల్ల ఫ్రేమూ, మాంచి 'స్టేండూ' కల్గి ఆ అద్దం బహు ముచ్చటగా వుండేది. ఆ అద్దాన్ని వెంకట్రావు గారు తన గదిలో బల్ల మీద వుంచుకున్నారు. ప్రతీ రోజూ ఉదయమూ, సాయంత్రమూ ఆ అద్దం ముందు ఐదు నిముషాలు వెంకట్రావుగారు నిలబడేవారు. గోపి దానిని ఎక్కడ విరగ్గొడతాడోనని వాడిని ఆ గది వైపే రానిచ్చేవాడు కాదు.

ఒక రోజు ఉదయం గోపి వాళ్ళమ్మ వంటింట్లో ఫలహారం తయారు చేస్తూంది. గోపి నాన్న గదిలోకి వెళ్ళాడు. వాళ్ల నాన్న యింకా నిద్రపోతున్నారు. నాన్నగారి బల్ల మీద వున్న అద్దాన్ని చూచాడు గోపి. ఆ అద్దంలో తన మొహం ఎలా వుంటుందోనని మెల్లగా దాన్ని తీశాడు. అటూ ఇటూ తిప్పుతూ తన మొహం చూచుకున్నాడు. "బాగుంది! ఈ అద్దం తాకితే ఎంత నున్నగా వుంది" అనుకుంటూ

వుండగా ఏదో చప్పుడైంది. అమ్మ వస్తుందన
వణికింది. చేతిలోనుండి రపీమని జారి క్రింద పడి

'బాబోయ్! నాన్నకు తెలిస్తే!' అద్దం
విరిగింది. మధ్యన చీలిపోయింది. చప్పుడు చేం
మీద వుంచాడు.

ఇంతకీ చప్పుడు అవటానికి కారణం ఏమి
నోట్లో ఎలుకను కరచుకొని పిల్లి పరుగెడుతోం
అనుకుంటూ గోపి నాన్నగారి గదినుండి బయ
అమ్మ దగ్గరకు వెళ్లాడు.

వాళ్ళమ్మ 'ఇంత సేపు ఎక్కడికెళ్లావురా

"వీధిలో ఉన్నానే అమ్మా! ఆకలేస్తోం
అని అడిగేడు. వాళ్ళమ్మ చక్కగా నేతితో గో
కొన్ని తినమని పెట్టింది.

ప్రక్క గదిలో నుండి "ఏడి ఆ వెధవ
వీపు పగల గొడుతాను"... అని వాళ్ళ నా
వినపడ్డాయి.

"ఏమిటి చేశావురా ?" అంది వాళ్ళమ్మ

అమ్మను చూడకుండా "ఏమి చేయలేదే.'

వెంకట్రావు గారి కేకలు మరింత ఎక్కు
ఆయన గదిలోకి వెళ్లింది, విషయ మేమిటో కన

ఆమె వెళ్లే సరికి వెంకట్రావుగారు త
వెనుకా, మంచం కిందా వెతుకుతున్నారు.

"ఏమిటండీ వెతుకు తున్నారు ?"

"బెత్తం." అన్నారు వెంకట్రావు వెదుకు

"ఎందుకూ ?" అంది ఆశ్చర్యంతో రత్నమ్మ.

"ఎందుకా? ఆ గోపీగాడి వీపు బద్దలు గొట్టడానికి... లేక పోతే...ఇంత మంచి అద్దం పగలగొడతాడా!...అసలు వీడిని ఎవరు రానిచ్చారిక్కడికి? - ఇవాళ వాడిని ఆ బెత్తంతో...ఏది ఆ వెధవ బెత్తం కనిపించదేం? వీడికనే ఆ బల్ల మీద వుంచాను. ఏమయి పోయిందీ?"

"నేనే తీసి దాచాను" అంది రత్నమ్మ.

"నువ్వు తీశావా? ఎందుకూ? ఎక్కడ పెట్టావో చెప్పు?"

"ఊహు. నేను చెప్పను. అసలు నా మాట వినండి. నేను నిన్న పిల్లల్ని ఎలా పెంచాలి? అనే పుస్తకము చదివేను. దానిలో..."

"ఇదిగో రత్నం. ముందర ఆ బెత్తం ఎక్కడుందో చెప్పు?"

"నే చెబుతున్నది వినండి. ఇప్పుడు మన గోపికి ఆరేళ్ళయినా నిండలేదు. మీరు ఎగ్జిబిషన్‌లో కొనుక్కున్న అద్దం విలువా, నాణ్యమూ వాడికేం తెలుస్తుంది చెప్పండి? నిన్న నే చదివిన పుస్తకం వ్రాసిన ఆయన అభిప్రాయమూ అదే. పిల్లలకి వాళ్లు చేస్తున్నది తప్పు, ఇది ఒప్పు అని వాళ్ళకు చెప్పవలసిన వాళ్ళం మనం. అంతే కానీ పిల్లల్ని వారు తెలియకుండా చేసిన పనులకు వాళ్లని కొట్టడం తప్పు. అందుచేత..."

ఇంతలో దాసీది గుమ్మం దగ్గర నిలబడి "అమ్మా, గోపి బాబుగారు ఇందాక మీరిచ్చిన చపాతీని ముక్కలు ముక్కలుగా చేసి కుక్కకి పడేస్తున్నారు." అంది.

అంతే - ఇంత సేపటినుంచి పిల్లల్ని కొట్ట కూడదని ఉపదేశం చేస్తూ వున్న రత్నమ్మ గారు తాను చేసిన చెపాతి పాడు చేస్తున్నాడన్న కోపంతో వెంకట్రావుగారిని చూచి "బెత్తాన్ని ఆ బీరువా మీద ఉంచాను" అని వీధిలోకి పరుగెత్తింది, గోపీని పట్టుకు రావడానికి.

తన అద్దం పగిలి పోయింద
వచ్చింది. ఆయనకు నీతులు చెబుత
చపాతీ పాడవు తున్నదని వినేటప్పు
పోయి గోపీని తీసుకు వచ్చి బె_త్తంత

భ_ర్తకు నీతులు చెప్పిన రత్న
నీతులను మరచిపోయి, అందుకు ప

ఇదే చపాతి మింగిన నీతి క

ఒకరికి చెప్పే నీతులు మనం






చాలా కాలం క్రిందటి సంగతి.

చైనా దేశంలో ఓ బీద అబ్బాయి వుండేవాడు. అతని తల్లి తండ్రులు చాలా పేదవారు. రోజల్లా కష్టపడి సంపాదించుకొన్న కూలి డబ్బులతో కడుపు నింపు కొంటూ వుండేవారు. వాళ్ళకి ఒక బుచ్చి తాటాకుల గుడిసె కూడా వుంది. అది చిన్నదైనా యెంతో పరిశుభ్రంగా వుంటుంది. ఇంటికి ఓ ప్రక్కని చిన్న కొట్టుగది వుంది. దాంట్లోనే ఆ అబ్బాయి వుంటూ వుండేవాడు. ప్రక్క గదిలో అతని తల్లి దండ్రులు ఉండేవారు. ఆ అబ్బాయి ఉదయాన్నే లేచి కాలకృత్యాలన్నీ తీర్చుకుని ఇల్లంతటినీ బాగా తుడిచేస్తాడు. ఎక్కడ వుండవలసిన సామాను అక్కడ సర్ది పేస్తూంటాడు. అంతట్లోకి వాళ్ళ అమ్మ అతనికి ఫలహారం తయారుచేస్తుంది. అది తిని అతను స్కూలుకి చదువుకుందుకు వెళ్ళిపోతాడు. తల్లి దండ్రులు కూలిపనికి వెళ్ళిపోతారు. అబ్బాయి మాత్రం చదువులో మంచి దిట్ట. మాష్టరుగారికి అతనంటే యెంతో యిష్టం! పిల్లలకు అతనంటే యెంతో సరదా! పొరుగునుండే వారికి అతనంటే యెంతో దయ. ఆ తల్లి దండ్రులకి అతనంటే ఎంతో ప్రేమ.

ఒకనాడు మాష్టరుగారు అతనికి ఓ పుస్తకాన్ని ఇచ్చి "దీన్ని యింటి దగ్గర చదివి రేపు తీసుకురావోయ్" అన్నారు. పుస్తకము చాలా

చిన్నది. అందంగా కూడా వుంది. అతను కూడా దాన్ని చదవటానికి ఎంతో ఉబలాటంగా తీసుకున్నాడు. అంచేత యింటికి వచ్చిన దగ్గర్నుంచి అతను దాన్ని చదవడంలో మునిగి పోయాడు.

"నాయనా! పొరుగువాళ్ళ ఇంట్లోంచి కాస్త నిప్పు తీసుకొస్తావూ? పొయ్యి ముట్టిస్తాను" అంది తల్లి. అతను వెంటనే పరుగెత్తి కెళ్ళి అగ్గి తీసుకు వచ్చి అమ్మ కందించాడు. "బాబూ, కాసిన్ని కట్టెలు తెచ్చిపెడుదూ" అని మళ్లీ పిలిచింది తల్లి.

టక్కున చదువు ఆపి అతను కట్టెలు కొని తీసుకొచ్చాడు. ఇంతలో చీకటి పడిపోయింది. పుస్తకం సగమే చదవటం అయింది. ఏమి చేస్తాడు పాపం! అతను కంగారు పడిపోయాడు. పుస్తకం ఆ రాత్రి తప్పకుండా చదివి యిచ్చేయాలి. పోనీ లాంతరు పెట్టి చదువుకుందామంటే యింట్లో అదీ కూడా లేదాయె! ఆ అబ్బాయి ఆలోచనలో పడ్డాడు. అలా ఆలోచిస్తుండగా చటుక్కున అతను గడ్డిపైన ఓ మిణుగురు పురుగు మెరుస్తూ వుండడం చూశాడు. గాలిలో ఎగురుతూ నక్షత్రాల లాగా మెరుస్తూ అక్కడక్కడ తిరుగుతూ వుంటాయి ఆ పురుగులు. దాన్ని చూసి అతని కళ్లు జిగేల్ మన్నాయ్. ఇంక దీపం అక్కర్లేకుండానే తన కోరిక తీరిపోతుందని అనుకుని ఆనందించాడు.

తరువాత ఒక్కొక్కటిగా అతను ఎన్నెన్నో మిణుగురు పురుగుల్ని పట్టి, వాటిని ఓ శుభ్రమైన తెల్లటి పల్చని గుడ్డలో యెంతో జాగ్రత్తగా మూటగట్టి వ్రేలాడగట్టాడు. ఆ మూటలో మామూలు లాగానే మిణుగురు పురుగులు బాగా మెరుస్తూండటం మొదలుపెట్టాయి. వాటి వెలుగులోనే అతను ఒక్కొక్క మాటని నింపాదిగా చదువుకుంటూ ఆఖరికి ఎలాగో ఆ పుస్తకాన్ని పూర్తిచేశాడు. దానితో అతని సంతోషానికి మితిలేకపోయింది. రోజూ ఒక్కొక్క పుస్తకాన్ని తెచ్చి యిలాగే చదువుతూ వుండేవాడు. ఈ మోస్తరుగానే అతను ఒక్కొక్కటిగా యెన్నెన్నో పుస్తకాలు చదివాడు. ఒకనాడు ఆ అబ్బాయి నేస్తం యెవరో ఒకాయన వచ్చి అతనిలా చదువుతూండడం చూచి "అదేంటోయ్, బావుంది, ఇంత కష్టపడుతున్నావేం? చైనా మంత్రివి అవుతా

వేమిటి కొంపదీసి ?" అన్నాడు వెటకారంగా. "అవునోయ్", ఆ అబ్బాయి నోటినుంచి అనుకోకుండా రాలిపోయినయ్ యీ మాటలు.

అతను రోజురోజుకి అభివృద్ధి పొందుతూ ఆఖరికి ఒకనాడు చైనా దేశానికి మంత్రి యెలాగూ అయిపోయాడు. ఇప్పటికి కూడా ఆ చైనా దేశంలో బీద తల్లులు యెంత గర్వంగా తమ పిల్లలకి యీ కథ జోల పాటల్లో చెబుతూ వుంటారు.





# అక్క

అలపర్తి
వెంకట సుబ్బారావు

"బాబూ! ఇవ్వాళ కూడా బడికి వెళ్ళవా?" అన్నది
బొంగరాల ఆట ఆడుతున్న కొడుకు వెంకట రమ

"రేపటినుంచి వెళ్తానమ్మా" అన్నాడు గోము
బొంగరం గుమ్మానికి కొడుతూ.

"వినాయకుడి పెళ్ళి ఎప్పుడంటే, రోజూ రేపే
అంటూ విసుక్కుంది రాజేశ్వరి.

"లేదమ్మా! నిజంగా రేపు వెళ్తానమ్మా!" ఎ
అన్నాడు వెంకటరమణ. "ఇవ్వాళేం! వర్జ్యం వుందా?
వ్యంగ్యంగా. కాని వెంకటరమణ సమాధానం ఇస్తేగ
రాలాటలో లీనం అయ్యాడు.

ఇంతలో "ఏమిట్రా మీగోల?" అంటూ లోప
సుందర్రావు.

"ఏముంది? మీ పుత్రరత్నం బడి ఎగగొట్టే ప్ర
రాజేశ్వరి ఆగ్రహంతో, ఒక్కొక్కమాట నొక్కి పలు

"ఓస్ ఇంతేనా! ఇంకేం కొంప మునిగిందో అనుకున్నా?" అన్నాడు సుందర్రావు నిర్లక్ష్యంగా నవ్వుతూ.

"అవున్లెండి! ఇప్పుడు మీకు అలాగే ఉంటుంది. రేపు వాడు పరమశుంఠలా బజార్ల వెంట తిరుగుతూంటే..." రాజేశ్వరి మాటమధ్యలోనే అందుకుంది.

"వాడెన్నటికీ శుంఠకాడు. మంచి పండితుడౌతాడు" అన్నాడు సుందర్రావు గర్వంగా.

"ఏమైతే నాకెందుకు? ఇష్టమై మీరు నెత్తికెక్కించుకుంటున్నప్పుడు..." రాజేశ్వరి సణిగింది.

"ఇందులో నెత్తికెక్కించుకోవడమేముంది?" ఎదురు ప్రశ్న వేశాడు సుందర్రావు.

"కాకపోతే ఏమిటండీ! మీరిచ్చిన అలుసుతో గదూ వాడిలా బడి దొంగ అవుతున్నాడు?" తప్పు సుందర్రావుదే నన్నట్టుగా మాట్లాడింది రాజేశ్వరి.

"అయితే నన్నేం చెయ్యమంటావు?" అన్నాడు సుందర్రావు.

"ఒక్కసారి గట్టిగా నాలుగు తగలనిస్తే వాడిలా బడికి ఎగనామం పెడతాడా? ఆటలు మరిగి చెడతాడా?" సలహా ఇచ్చింది రాజేశ్వరి.

"ఏదోలే పోనీ! ఈ ఒక్కరోజుకి వాడి కోరిక చెల్లించు. రేపటినుంచి వెళ్తాడులే?" అంటూనే "ఏరా బాబూ, రేపటినుంచి వెళ్తావుకదూ," అన్నాడు సుందర్రావు కూరిమితో, కుమారునితో. "అలాగే నాన్నా!" అని వాడు తల ఆడించాడు. వెనువెంటనే వీధిలోకి ఉడాయించాడు, వెంకటరమణ.

సుందర్రావు అందరిలాంటివాడు కాడు. అతని ఆలోచనలే వేరు. పిల్లల చదువుల విషయంలో అతని పద్ధతులు వింతగా వుంటాయి! పిల్లల్ని బలవంతంగా రోజల్లా బళ్ళో కూర్చోబెట్టి పాఠాలు బోధించడం అతనికి నచ్చదు. ప్రశాంత వాతావరణంలో ఆటపాటలతో శాంతినికేతన్‌లోలాగా చదువు చెప్పాలని అతని ఉద్దేశం.

వెంకటరమణ మంచి చురుకైనవాడు. తె
ఎప్పటికైనా బుద్ధిగా చదువుకోకపోడు: ఇదే
యంలో సుందర్రావు నమ్మకం. ఆ నమ్మకంతోనే
విషయంలో ఎందరెన్ని విధాలుగా అంటున్నా, సు
పడలేదు; చిందులు తొక్కడంలేదు.

రాజేశ్వరి సుందర్రావులకు ముగ్గురు ఆడపిల్ల
ఏకైక పుత్రుడు వెంకటరమణ. అందుకే ఆ కు
వాడంటే అమితానురాగం.

ముఖ్యంగా సుందర్రావుకి వాడొక గారా
కొండ. అందరూ వాణ్ని ముద్దుగా 'బాబూ' అని
పెద్దమ్మాయి సుందరి మంచి మార్కులతో అన్ని క్లా
కాలేజీ హాస్టల్లోనే వుంటూ చదువుకొంటోంది.

తమ్ముని చదువు విషయంలో సుందరికెంతో
చదువు చదివి, పెద్ద పెద్ద ఉద్యోగాలు చెయ్యాలని
కుంటూ ఉంటుంది. మనుషులు దూరమైనా మనసు
కొన్ని మైళ్ళ దూరంలో వున్నా సుందరి ఎప్పుడూ
తమ్ముని చదువు గురించి ఆలోచిస్తూ వుంటుంది.

"పోస్ట్" అన్న కేకవిన్న వెంకటరమణ గ
పరిగెత్తాడు. 'ఇదిగో బాబూ! నీకోజాబు!' అంటూ
నవ్వుతూ ఓ ఉత్తరం ఇచ్చి వెళ్ళాడు పోస్టుమాన్.

ఇంకేం, వెంకటరమణ ఆనందానికి అంతులే
జాబు. ఎక్కడినుంచో? ఇంకెక్కడనుంచి... సుంద
ఇంతకీ...ఏం...వ్రాసిందో, తనకా, చదవడంరాదు
వించుకోవాలి...అనుకోవడమేఆలస్యం, చిన్నక్క లలి

"లలితక్కా! లలితక్కా! నాకు జాబు వచ్చిం
అన్నాడు. బడికి వెళ్ళడంకోసం పుస్తకాలు సర్దుకుం
"ఇప్పుడు నావల్లగాదు బాబూ! అసలే బడికి ఆలస్యమై
పనిలో మునిగిపోయింది.

వెంటనే రెండో అక్క రజని దగ్గరకు వెళ్ళాడు వెంకటరమణ.

"రజని అక్కా! రజని అక్కా! నాకు జాబొచ్చింది. లలితక్కను చదవమంటే బడికి టైమైందంటూంది. నీవైనా చదివి పెట్టవూ?" అని ప్రాధేయపడ్డాడు.

"ఉండరా! ఈ సైన్సుబొమ్మలు ఈ పూటే ఇండియన్ ఇంక్‌తో వేయాలి. బడికి తీసుకెళ్ళాలి... లేకుంటే మా మాష్టారు వూరుకోరు. నన్ను కదలించకు. నీకు పుణ్యముంటుంది" అన్నది రజని.

మళ్ళీ బిక్కమొగంతో అక్కడినుండి కదిలాడు వెంకటరమణ.

సరాసరి వంట ఇంట్లోకి వెళ్ళాడు. "అమ్మా! అమ్మా! నాకో జాబొచ్చింది. లలితక్కని చదవమంటే బడికి టైమైందంటూంది. రజని అక్కని చదవమంటే సైన్సు బొమ్మ లేసుకోవాలంటూంది. అమ్మా! నువ్వు చదవ్వా?" జాలిగా అడిగాడు.

రాజేశ్వరి అసలే కోపంగా వుంది, వాడు బడికి సరిగా వెళ్ళడం లేదని. "చెయ్యి ఖాళీగా లేదు. పొయ్యిమీద నెయ్యి మరగ కాగేలా వుంది. వెళ్ళి మీ నాన్నచేత చదివించుకో" అంది. ఇంకేం! బిక్కుబిక్కు మంటూ నాన్న గదిలోకి వెళ్ళాడు వెంకటరమణ. తండ్రి అంటే ఎంత చనువో, అంత భయం.

"నాన్నా! నాన్నా! నాకో జాబు వచ్చింది. లలితక్కని చదవమంటే బడికి టైమైందంటూంది. రజనక్కని చదవమంటే సైన్సు బొమ్మ లేసుకోవాలంటూంది. అమ్మనడిగితే నెయ్యి మరగ కాగుతోందంటూంది. నువ్వు చదువు నాన్నా!" అన్నాడు, చల్ల చల్లగా వెంకటరమణ. "అబ్బబ్బ! నా ఆలోచన అంతా చెడగొట్టావు గదరా! చక్కని పాట. మధ్యలోనే ఆగిపోయింది. అసలు... నేను వ్రాసుకునే టప్పుడు నా గదిలో అడుగు పెట్టవద్దని ఎన్నిసార్లు చెప్పాను?" అని కేకలు వేశాడు సుందర్రావు.

బిత్తరపోయిన వెంకటరమణ, తత్తర తత్తరగా దేవుని గదిలోకి వెళ్ళాడు. అక్కడ పూజ చేసుకుంటూ వున్న తాతయ్యని చూశాడు.

"తాతా! తాతా! నాకో జాబు వచ్చింది. లలి
బడికి సైమెందంటూంది. రజనక్కను చదవమ
లేసుకోవాలంటూవుంది. అమ్మని చదవమంటే
పోతోందంటూంది. నాన్నని చదవమంటే తన ఆ
టున్నాడు. నువ్వయినా చదివి పెట్టు తాతా"! అ

"నాకు మాత్రం ఈ పూజ పూర్తి కావ
ఓపిక పట్టు" అన్నాడు తాత. కానీ అందా
లిప్పటికే చాలా ఆలస్యం అయింది. ఒక్కరు గా
చదవలేదు. ఎక్కడ లేని కోపం వచ్చింది, వెంకట

అసలింతకీ చదువు రాకపోవడం చేతనే
బ్రతిమిలాడ వలసివచ్చింది. తనకే చదువు వచ్చి
అయ్యేదా? వెంటనే చదువుకుని వుండేవాడు.

తాను చదువుకోక పోయినందుకు బాధ క
చదివి పెట్టనందుకు ఏడుపు వచ్చింది. మంచం మీ
తలదూర్చి వెక్కిళ్ళు పెట్టసాగాడు వెంకటరమణ.

ఆ ఏడుపు విని అందరూ అక్కడికి వచ్చార

"ఏమిటి బాబూ! ఏమిటి?" అంటూ బాబు
పాడు సుందర్రావు.

"ఆ, ఏముంటుంది? ఆ ఉత్తరం ఎవ్వరూ
అన్నది రాజేశ్వరి.

"ఏం బాబూ! అంతేనా?...అయితే ఏదీ ఇ
చదువుతాను" అంటూ బాబు చేతిలోని జాబు తీ
సుందర్రావు.

"చిరంజీవి ముద్దుల తమ్ముడికి, పెద్దక్క
వ్రాయునది. ఇక్కడ నేను క్షేమం. అక్కడ
ఆశిస్తాను. నీవు రోజూ సక్రమంగా బడికి వెళ్ళి శ్ర

వని భావిస్తాను. బాగా చదివి పెద్ద డాక్టరువి కావాలనేదే నా కోరిక! నా కోరిక తీరుస్తావుగదూ? ఇక వుంటా!

— ఇట్లు నీ అక్క సుందరి."

జాబు పూర్తిగా విన్న బాబు, మనస్సులో ఏమనుకున్నాడో ఏమో, రివ్వున లేచి పుస్తకాల సంచీ చంకన తగిలించుకుని రివ్వున బడికి వెళ్ళాడు.

అంతే! మళ్లీ బడికి వెళ్లనని ఎన్నడూ మారాం చెయ్యలేదు వెంకటరమణ.






పూర్వం నూరు సంవత్సరముల క్రిందటిమాట. బంగాళన
ఖాన్ ముర్షిదాబాద్ రాజధానిగా చేసుకొని పరిప
వాడు. ఆయన సేనాపతి విజయసింహుడు. ఆయన పే
ప్రక్కల రాజులకు భయం. ఆయన కుమారుడు జాలిమ
ఎనిమిది సంవత్సరాలు. తండ్రి వానికి వీర విద్యలన్నీ

ఒకమారు బంగాళ నవాబు బీహారుపైకి దండె
సింహుని పంపేడు. వానితోకూడ జాలిమసింహుడు ఉన
సింహుడు బీహార్ మీదకు దండెత్తగానే సమయం చూస
ఖాన్ ముర్షిదాబాద్‌పైకి దండెత్తేడు. ముర్షిదాబాద్ సై
హోరిగా పోరాడేరు. కాని లాభం లేకపోయింది. సర
సంహరించి, రాజ్యం వశపర్చుకొన్నాడు. సైనికులు
ఇంతలో యీ వార్త విజయసింహునికి తెలిసి, కొంత సై
ఖాన్‌పై పడ్డాడు. రెండు వర్గాలవారు ఘోరంగా పో
విజయలక్ష్మి యీమారు అలివర్దీఖాన్‌ను వరించింది.

విజయసింహుడు యుద్ధరంగంలో పడిపోయేడు. జాలిమసింహుడు తండ్రి పడిపోవడం చూచి, వెంటనే ఒరనుండి కత్తినిదూసి తండ్రి దగ్గరకు ఎవరినీ రాకుండా కాపాడుతున్నాడు. సైనికులెవరూ పిల్లవాని దగ్గరకు పోలేక పోతున్నారు. సైనికులలో ఒకడు పిల్లవానిని మాయోపాయంతో చంపాలని, వెనుకకుపోయి కత్తి విసరపోయేడు. ఇంతలో అలీవర్ది ఖాన్ "పిల్లవానిని చంపవద్దు. పిల్లవానికి ఏ అపద వచ్చినా మీ తలలు తీసేస్తాను" అని గద్దించేడు.

సైనికులంతా చేతులు జోడించి నిలబడ్డారు. అలీవర్ది ఖాన్ పిల్లవాని దగ్గరకుపోయి "బాబూ, నీతండ్రి వీరస్వర్గం అలంకరించేడు. వారికి దహన సంస్కారాలు రాజలాంఛనాలతో జరిపిస్తా. నీవు పెద్దవాడివైన తరువాత, నిన్ను ఈ రాజ్యానికి సైన్యాధిపతిగా చేస్తాను. అంతవరకూ నీవు మా రాజభవనంలో హాయిగా ఉండవచ్చు. నేను దేవుని సాక్షిగా మాట యిస్తున్నాను. ఇక శాంతించి కత్తిని ఒరలో ఉంచు" అన్నాడు.

జాలిమసింహ శాంతించి వెంటనే కత్తిని ఒరలో ఉంచేడు.

అలీవర్ది పిల్లవానిని దగ్గరగా తీసుకొని ముద్దాడేడు.








చిట్టి బాల బీద పిల్లవాడు. ప్రతిరోజూ వీధిలో పాటలు పాడుతుంటే దయతలచి ఎవరైనా ఇచ్చిన పైకముతో జీవనము గడిపేవాడు. ఒకనాడు ఎన్ని పాటలు పాడినా ఒక్కరైనా ఒక్క దమ్మిడీ ఇచ్చిన పాపాన పోలేదు. ఈ రాత్రికి తిండి లేదనుకుంటూ ఒక వీధిలోంచి అలా పోతున్నాడు. అకస్మాత్తుగా చిట్టి పాదానికి ఏదో వస్తువు తగిలినట్లనిపించింది. వంగి చూశాడు. బంగారు గొలుసు కిందపడి తళతళ మెరుస్తోంది. కాళ్ళు గడగడలాడాయి, గుండె దడదడ మన్నది, చిట్టికి. వస్తువును చేతిలోనికి తీసుకొని పెద్ద కళ్ళుచేసి చూశాడు. చిట్టి శరీరం చెమటలు పోసింది. పోలీసు చూస్తే దొంగ అని పట్టుకుంటాడేమోననిపించి చుట్టూ చూశాడు. ఎవరూ లేరు.



"పరుల సొమ్మును తాకకు నాయనా, తప్పు" అని చనిపోతూ తల్లి చెప్పిన మాటలు జ్ఞాపకానికొచ్చాయి. "తప్పు -- తాకను, తాకను అనుకొని గొలుసును కళ్ళ కద్దుకొని తీసిన చోటే దాన్ని పెట్టేసి, పారిపోదామనుకుని రెండడుగులు వేశాడు. చిట్టి చేసిన పని చూస్తున్న ఒక ఇంటి యిల్లాలు బయటికి వచ్చి చిట్టిని పిలిచింది. చిట్టి భయంతో వణుకుతూ "నేను దొంగను కానమ్మా" అన్నాడు.



"దొంగవి కాదు, దొరవి బాబూ- ఈ గొలుసు నా కుమారునిది. నీ మంచి బుద్ధికి సంతోషించాను. నీవంటి బాలలు మనదేశంలో ఉంటే భారతమాత గర్విస్తుంది నాయనా, నువ్వే తీసుకో" అంటూ చిట్టి మెడలో బంగారుగొలుసును పెట్టి కౌగిలించుకుంది. చిట్టి కళ్లనుంచి ఆనంద బాష్పాలు రాలాయి.

# ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి ప్రచురణలు

## బాల సాహిత్య సంకలనాలు


| | |
|---|---|
| 1. తారంగం : తారంగం | సంకలనకర్త : |
| 2. గోరుముద్దలు— (రంగురంగుల చిన్నారి బొమ్మలపాటలు) | డా॥ (కుమారి) యమ్. కె. దేవకి |
| 3. మల్లెలు : మందారాలు (బొమ్మల గేయాలు) | సంకలనకర్త : బి. వి. నరసింహారావు |
| 4. పసిడి తెర (బాల నాటికలు) | సంకలనకర్త : న్యాయపతి రాఘవరావు |
| 5. చిరుగజ్జెలు (బాలగేయ నృత్యనాటికలు) | సంకలనకర్త : ఏడిద కామేశ్వరరావు |
| 6. అనగా అనగా (కథలు) | సంకలనకర్త : మండా సూర్యనారాయణ (మసూనా) |
| 7. గోడమీద బొమ్మ (పొడుపు కథలు) | సంకలనకర్త : వెలగా వెంకటప్పయ్య |
| 8. వెలుగుబాటలు (జీవిత చరిత్రలు) | సంకలనకర్త : కవిరావు |



ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

34/4 RT, బర్కత్‌పురా క్వార్టర్స్

హైదరాబాదు-500 027

*Cover Printed at Pragati Art Printers*